## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని వికాస ధాత్రి వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. దీనిద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) వికాస ధాత్రి వారి వెబ్ సైట్: www.vikasadhatri.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో వికాస ధాత్రి వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

Vikasa Dhatri offers Telugu e-books for free Download - Mozilla Firefox

File Edit View History Delicious Bookmarks Tools Help Telugu

http://vikasadhatri.org/

:: DOWNLOAD TELUGU E-BOOKS :: HOME E-BOOKS BOOKS WRITERS' DIRECTORY JOURNALISTS' DIRECTORY CONTACT SUBSCRIBE



Get Telugu Books Free

www.vikasadhatri.org

| Subscribe Vikasa Dhatri | Book for Change Makers | Book of our choice |
|---|---|---|
| Vikasa Dhatri offers Telugu e-books for free downloads. Stories, Novels, Poems, plays; history, travelogues, Spiritual, religious, political, Science and Technology, computer books, newsletters on consumer rights, environment education, gender, dalit rights, welfare schemes and many more books for voluntary organizations are available now. We are adding books about music, music albums, movies, career development, modelling, fashion designing, parenting guides, child care, kids names, reproductive health, HIV- AIDS and the list goes on. We plan to include many more Telugu books for your reading pleasure! To get download link of books, newsletters and other updates subscribe to Vikasa Dhatri | **Yajamanulu Kaadu Sevakulu**  Telugu book on Citizen Charters, governance and Consumer Rights written by Gali Udaya Kumar and published by Consumer Education Society (CES). CES is a voluntary organization dedicated to the protection and promotion of consumer interests. CES is focussing on consumer rights, environment education, health, poverty, gender and good governance. CES is developing information, education, communication material and facilitating participatory trainings. Download ** More books on Consumer Rights | **Bhadrachalam Mannem Katalu** Compilation of Telugu short stories written by A.Vidya Sagar, I.A.S., based on his experiences while working as a Project Officer in Integrated Tribal Development Agency in Khammam District , Andhra Pradesh.  'Nagaranikochina Nagallu', 'Visakha Na Vishakha', 'Asalu Santakam', 'Manishokade Vidiga Manaledu' are some of his other books. Download |
| Telugu Book Club | Guest Book | Telugu Greetings |



Done

start Vikasa Dhatri off... 10:13 AM

| | |
|---|---|
| రచయిత | : "భాషా ప్రవీణ" **సాదినేని రంగారావు,** ఎం.ఏ (లిట్) |
| జననం | : 10 జనవరి 1946 గురువారం |
| జననీ జనకులు | : శ్రీమతి అన్నపూర్ణమ్మ, శ్రీ వెంకటప్పయ్య చౌదరి |
| జన్మభూమి | : గొట్టిపాడు గ్రామము, ప్రతిపాడు (మం.), గుంటూరు జిల్లా, ఏ.పి. |
| విద్యాభ్యాసం | : గొట్టిపాడు శ్రీ శిష్లా లక్ష్మీనారాయణగారి పాఠశాల (1951-56)<br>పొన్నూరు శ్రీ సాక్షి భావనారాయణస్వామివారి సంస్కృత కళాశాల<br>భాషాప్రవీణ (1965-71), పి.ఓ.యల్ & ఎం.ఏ. (లిట్) |
| వృత్తి | : 16-10-1975 నుండి 31-1-2004 వరకు తెనాలి పురపాలకోన్నత<br>పాఠశాలల తెలుగు భాషా పండితోపాధ్యాయ వృత్తి |
| అభిమాన కృషి (ప్రవృత్తి) | : సాహిత్య వ్యాసాంగం, గ్రంథ రచన, కవిత్వ దీక్ష, గ్రంథాలయోద్యమ<br>కృషి, వయోజన విద్య, సాంఘిక సేవ |
| రచనలు | : ముద్రితాలు 15, త్వరలో ముద్రింపనున్నది 1. |
| భార్య | : శ్రీమతి సాదినేని రామతులశమ్మ - గృహిణి |
| కుమారులు | : 1. శివరామకృష్ణ, ఎం.ఎస్సీ. బయో కెమిస్ట్రీ లెక్చరర్<br>శ్రీ అన్నాబత్తుని సత్యనారాయణ డిగ్రీ & పీజీ కళాశాల-తెనాలి.<br>వీని భార్య శ్రీమతి ధనలక్ష్మీ, ఎం.ఎస్సీ., బయో కెమిస్ట్రీ లెక్చరర్<br>వి.యస్.ఆర్. & యన్.వి.ఆర్. కళాశాల - తెనాలి.<br>వీరి కుమార్తె చి॥ శ్రీసృజన<br>2. రాధాకృష్ణ, బి.ఏ., పౌల్ట్రీ ఫీడ్ వ్యాపారము - తెనాలి.<br>వీని భార్య శ్రీమతి నీలిమ బి.ఎస్సీ., - ఉపాధ్యాయని<br>శ్రీ నాగార్జున పబ్లిక్ స్కూల్, గాంధీనగర్, తెనాలి.<br>వీరి కుమారుడు చి॥ శ్రీకృష్ణ |

కీర్తి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, తెనాలి. సెల్ : 9441065592




"భాషా ప్రవీణ" సాదినేని రంగారావు ఎం.ఏ.

# పెండ్లి సందడి

## (వివాహ పద్ధతి)



**రచన**

**"భాషాప్రవీణ" సాదినేని రంగారావు ఎమ్.ఎ.**

వెల : రూ. 60 /-



ప్రథమ ముద్రణ : జనవరి 2009 ప్రతులు : 1000



ప్రతులకు : **సాదినేని రంగారావు** ఎమ్.ఎ.
అన్నపూర్ణ భవనము, డోర్.నెం. 2-22-30
దేవినేని వెంకయ్య వీధి, గాంధీనగర్, **తెనాలి** - 522 201.
గుంటూరుజిల్లా, ఎ.పి. **సెల్ : 99490 52849**

టైపు సెట్టింగు : కీర్తి గ్రాఫిక్స్, తెనాలి.
ముద్రణ : కీర్తి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, తెనాలి.

**సాదినేని రంగారావు గారి రచనలు, ముద్రణలు :**

1. భారతరత్న శ్రీమతి ఇందిరాగాంధీగారి బుర్రకథ 1972
2. భద్రాద్రి సీతారాముల కళ్యాణము (వ్యాఖ్యానము) 1973
3. హైస్కూలు తెలుగు వ్యాకరణము 1975
4. హైస్కూలు & కాలేజి తెలుగు వ్యాకరణము 1975
5. భారతరత్న శ్రీమతి ఇందిరాగాంధీగారి జీవితచరిత్ర 1977
6. రాష్ట్రపతి డా. నీలం సంజీవరెడ్డిగారి జీవితచరిత్ర 1979
7. హైస్కూలు & కాలేజి 65 నవీన వ్యాసలేఖలు 1982
8. హైస్కూలు & కాలేజి హిందీ వ్యాకరణము 1982
9. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులు 1986
10. మాజీ ముఖ్యమంత్రి "అన్న" శ్రీ ఎన్.టి.ఆర్. గారి జీవితచరిత్ర 1991
11. హైస్కూలు & కాలేజి తెలుగు జాతీయములు 1992
12. శ్రీ కనకదుర్గమ్మ చరిత్ర & కృష్ణానది పుష్కర చరిత్ర 1992
13. కమ్మవారి ఇళ్ళపేర్లు, వాడుక గోత్రములు, గణములు, గోత్రఋషులు (ఋషీగోత్రములు), ప్రవరలు, సూత్రకర్తలు 1993 వెల.రూ.300/-
14. ఆదర్శోపాధ్యాయుడు డా. సర్వేపల్లి రాధాకృష్ణ జీవితచరిత్ర 2002 వెల. రూ. 15/-
15. పెండ్లిసందడి (వివాహపద్ధతి) 2009 వెల. రూ. 60/-
16. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర (త్వరలో ముద్రణ)

---

**సాదినేని శివరామకృష్ణ** ఎమ్.ఎస్సీ.
షాపునెం.29, శ్రీ యడ్లగంగాధరరావు మున్సిపల్ షాపింగ్ కాంప్లెక్స్, లక్ష్మీ డీలక్స్ ఎదురు, ప్రకాశంరోడ్, గంగానమ్మ పేట, తెనాలి - 522 201. సెల్ : 99490 52849

## అందరూ చదువతగిన పుస్తకం

"భాషాప్రవీణ" శ్రీ సాదినేని రంగారావుగారు మూడు దశాబ్దాలపాటు తెలుగు భాషా పండితునిగా పనిచేసి రిటైరయినారు. ప్రవృత్తిరీత్యా ప్రజానీకానికి ఉపయోగపడే అనేక పుస్తకాలను వ్రాసి మంచి పేరు తెచ్చుకున్నారు. తాజాగా వీరు వ్రాసిన "పెండ్లి సందడి" (వివాహ పద్ధతి) పుస్తకంలో పెండ్లి వేడుకల పుట్టుపూర్వోత్తరాలను, ఆనాటి వేదాలు, స్మృతులలో నిక్షిప్తమైన సదాచారాల దగ్గరనుండి, వివాహాలలో విభిన్న రకాలను, వివాహ ప్రక్రియలలోని వివిధ దశలను విపులంగా వివరంగా సులభగ్రాహ్యంగా సుబోధకంగా శ్రీ రంగారావుగారు వివరించారు.

ఆయుర్వేద వైద్య విజ్ఞానం ప్రకారం యువతికి 18 సంవత్సరములు, యువకునకు 25 సంవత్సరములు దాటితేనే వివాహార్హత లభిస్తుందని చక్కగా తెలిపారు. బౌద్ధులు, చైనీయులు యూదులు మొదలైన వివిధ ప్రపంచ జాతులు ఆచరించే వివాహపద్ధతులను ముచ్చటిగొలిపేటట్లు తెలిపారు. "పెండ్లంటే నూరేళ్ళ పంట" అన్న పెద్దల మాటలను ఉటంకిస్తూ, సామాజిక జీవనానికి, కుటుంబ వ్యవస్థకు అంకురార్పణ చేసేది వివాహమేనని తెలిపారు. గృహస్థాశ్రమం స్వీకరించే వధూవరులు, రాబోయే సమస్యలను కష్టనష్టాలను ఎదుర్కొనే శక్తి సామర్థ్యాలు, గుండె దిటువు, ప్రజ్ఞావిశేషాలు, సహన, సానుభూతులు అవసరమని హితవు పలికారు.

తల్లిదండ్రుల రుణము, దేవతా రుణములతోపాటు సామాజిక రుణాన్ని చెల్లించుకోవడానికే వివాహము ముఖ్య భూమికగా ఉపకరిస్తుందన్న ప్రాచీనుల అభిప్రాయాన్ని ప్రస్తావించారు. వివాహమనేది ఒక పవిత్ర బంధమనీ, వివాహ వేడుకలలోని ప్రతిఘట్టము కమనీయము, మనోజ్ఞము, రసవత్తరమూ, కన్నుల పండుగగా శోభిస్తుందని శ్రీ రంగారావుగారు విపులంగా వర్ణించారు.



వధూవరుల అన్వేషణ, పెండ్లిచూపులు, తాంబూలములు పుచ్చుకొనుట, వధూవరుల లక్షణములు, సముహూర్తము గురించి, వివాహమునకు మంచి వాటిని గురించి, శుభలేఖలు, పెండ్లిచూపులు గురించి, లగ్నపు (పెండ్లి) రోజు గురించి, వరుడు తరలివెళ్ళడము, బాషికాలను గురించి వరపూజ, రక్షాబంధనము, యజ్ఞోపవీతము, గౌరీదేవిపూజ. కన్యాదాన గొప్పతనము, కన్యాదాన ఫలితము, సుముహూర్తము, జీలకఱ్ఱ బెల్లము, వధూవరుల ప్రమాణములు, వధూవరుల తొలిస్పర్శ, వధూవరుల శుభదృష్టి, మాంగళ్య ధారణ, అక్షతలు, తలంబ్రాలు, బ్రహ్మముడులు, అగ్నిప్రతిష్ఠ, ప్రదక్షిణములు, పాణిగ్రహణము, పూలదండలు, శిలారోహణము, సప్తపది, మట్టెలు, పిల్లేళ్ళు, వధూవరుల చదివింపులు, వధూవరుల జలక్రీడలు, శ్రీ సూర్యభగవానుని సందర్శనము, ధ్రువనక్షత్ర సందర్శనము, అరుంధతీ నక్షత్ర సందర్శనము, అప్పగింతలు, ఊరు ఎరిగింపు, శ్రీ సత్యనారాయణ స్వామివారి వ్రతము, గర్భాధానము (శోభనము), పదహారు రోజుల పండుగ. ఇవన్నీ శ్రీ రంగారావు గారు సవిస్తరంగా తెలుపుతూ ప్రతి విషయమునకు, ప్రతి ప్రక్రియకు గల ప్రాధాన్యతను వివరించారు.

నుదుట ధరించే తిలకము, వధూవరుల అలంకరణలు, పెండ్లిపందిరిలో మామిడాకుల తోరణాల ప్రాధాన్యమును గురించి అనేక విశేషాలను తెలిపారు. పచ్చని మామిడాకుల తోరణాలు కంటికి హాయినవ్వటమేగాక, అనేక మంది గుమిగూడిన వివాహ మందిరంలో బొగ్గుపులుసు వాయువును పీల్చుకొని, స్వచ్ఛమైన ప్రాణవాయువునందిస్తాయనే వైజ్ఞానిక సత్యాలను రమణీయంగా వర్ణించారు. అలాగే ఆడవారికి సౌభాగ్య చిహ్నమైన గోరింటాకు గురించి, యజ్ఞోపవీతము, మధుపర్కాలను గురించి అనేక విశేషాలు తెలిపారు. వరపూజ చేయడం, దీక్షాకంకణధారణ, మంగళగౌరీదేవిపూజ, కన్యాదాన కార్యక్రమ గొప్పదనము, జీలకఱ్ఱబెల్లము పెట్టడములో అంతరార్థము, మేళతాళములు,

మాంగళ్యధారణ, మంగళసూత్రాల ప్రాముఖ్యత ఎంతో స్పష్టంగా విశదీక రించారు. తాళిబొట్లు దారములో ఇముడుకొనే శక్తి ఈ రెంటికీ వున్నదని వాటిని "ప్రేమ" అనే సూత్రము మూడుముళ్ళతో లభిస్తుందని నూతన దంపతుల పరస్పర ప్రేమాభిమానాలకు మంగళసూత్రాల మధుకరమైన చిహ్నమని కమనీయంగా వర్ణించారు. దేశంలోని వివిధ ప్రాంతములలో ఆచారములో వున్న వివాహ సంకేతాలైన నల్లపూసలు, గాజులు, మంగళ సూత్రము, ముక్కెరలు, కాలిమెట్లు, గజ్జెలపట్టీలు, పిల్లేళ్ళు, నాగరాలు వీటన్ని టినీ సవిస్తరంగా శ్రీ సాదినేనివారు వివరించారు. అక్షతలు, తలంబ్రాలు, అగ్నిప్రతిష్ట, పాణి(కర)గ్రహణము, పూలదండలు, శిలారోహణం, సప్తపది, సూర్య, ధ్రువ, అరుంధతీ నక్షత్రాల సందర్శనాల ప్రాధాన్యతలను నేటి తరం వారికి చక్కగా తెలియజేశారు.

చివరలో అప్పగింతలు, ఊరుఎరిగింపు, వరుని ఇంట శ్రీ సత్యనారాయణ స్వామివారివ్రతము లేక నోము, పదహారురోజుల పండుగవరకు శ్రీ రంగా రావుగారు చదువరులను ఆకట్టుకొనే విధంగా ప్రామాణికంగా రచించారు.

కొన్ని దశాబ్దముల క్రిందట "ఆంధ్రవిశారద" తాపీ ధర్మారావుగారు "పెళ్ళి - పుట్టుపూర్వోత్తరాలు" అనే పుస్తకం వ్రాసి సంచలనం కలిగించారు. "కవిరాజు" త్రిపురనేని రామస్వామిచౌదరిగారు "వివాహవిధి" అనే పేరుతో సంస్కరణ వివాహవిధి విధానాలను తెలిపే పుస్తకం వ్రాశారు. భారతీయ సంస్కృకి అనుగుణంగా, తరతరాలనుంచి మనకు సంక్రమించిన "వివాహ ప్రక్రియ" లోని విశేషాలను వైద్యశాస్త్రీయ వివరణలతోపాటు మన పూర్వుల ఆకాంక్షలను, పరమార్థాలను, అంతరార్థాలను నేటి తరానికి అర్థమయ్యేలా చక్కని శైలిలో తెలియచేసిన శ్రీ సాదినేని రంగారావుగారు అభినందనీయులు.

గీతానర్సింగ్‌హోమ్
తెనాలి
1-11-2008 }

డాక్టరు **పాటిబండ్ల దక్షిణామూర్తి** M.D
చైతన్యవేదికాధ్యక్షుడు, తెనాలి.



## "వివాహపద్ధతి" కి - అభిప్రాయము

శ్రీ సాదినేని రంగారవుగారిచే రచింపబడిన ఈ గ్రంథమును పరిశీలనా త్మకముగా పఠించితిని. ఈ గ్రంథము పేరు పెండ్లిసందడి (సంబరం) అనుట కంటె వివాహపద్ధతి అనుటయే సమంజసముగా నుండునని భావింతును.

ఇప్పటివరకు జరుపబడు పెండ్లితంతులో చదివే శ్లోకములు, మంత్రములు సంస్కృతభాషలో నుండుటవలన వధూవరులకుగాని, పెండ్లిని చూచు పెద్దలకుగాని వాటి అర్థము తెలియనందున అది ఒక అవ్యక్త క్రియగా మాత్రమే జరుపబడుచున్నది.

శ్రీ రంగారావుగారు పెండ్లిపద్ధతిలో జరుపు ప్రక్రియలను గూర్చి అనేకానేక విషయములను సేకరించి వాటి పూర్వాపరములు, పుట్టుపూర్వోత్తరములు, సరళమైన వ్యావహారికభాషలో ఈ విధముగా వివరముగా వ్రాయడం మిక్కిలి ముదావహము, అత్యంత ప్రయోజనకరము.

ఇందులో అష్టవిధవివాహములను గూర్చియు విపులముగా వ్రాసిరి. కొన్ని విదేశ వివాహపద్ధతులను కూడా తెలియజేసిరి. వివాహ నిర్వహణ ప్రారంభము నుండియు జరుపవలసిన అన్ని అంశములను చక్కగా వివరించిరి. వధూవరుల గుణశీలములను బాగుగా పరీక్షించి పెండ్లి చేయుటకు నిర్ణయించుట జరుపుట మిక్కిలి శ్రేయోదాయకమని వ్రాసిరి. అనేక ప్రాంతములలో జరుపబడు, పాటించబడు ప్రాంతీయ ఆచారములను కూడా వివరించిరి.

ముఖ్యముగా పెండ్లితంతులో జరుపబడు వివిధ అంశములు-ప్రక్రియలు వధూవరులకు చక్కగా బోధపడునట్లు తెలియజేసిరి. అన్నింటికి మించి వైదిక వివాహ ప్రక్రియలు వాటిని జరుపునపుడు వధూవరులచే చేయించు ప్రమాణములు, గృహస్థధర్మములు, వారిగార్హస్థ్య జీవన సాఫల్యమునకు మిక్కిలిగా ఉపయోగపడునని నొక్కి వక్కాణించిరి.

ఇందు పొందుపరచిన విషయములన్నియు, వధూవరులకే కాక, పెద్దలకు కూడా తెలియదంవలన వారు తమ పుత్ర, పుత్రికలకు సమర్థవంతముగా పెండ్లిండ్లు జరుపుకొనుటకు ఈ గ్రంథము కరదీపికగా నుపయోగపడును.

శ్రీ రంగారావుగారు మరికొంత కృషిచేసి, యిటువంటి ఉత్తమగ్రంథము లను మరికొన్నింటిని ముందు ముందు యింకను వ్రాయవలసినదిగా కోరుచూ అందులకు పరమేశ్వరుని అనుగ్రహము సర్వదా లభించవలయుననీ కోరుచున్నాను.

తెనాలి
30-10-2008 }

**రావి వెంకటరావు** (రిటైర్డ్) హెడ్మాష్టరు M.P.R.E.S
వైదిక పురోహితుడు, వట్టి చెరుకూరు
గుంటూరుజిల్లా.

## శతాయుష్మాన్భవ

రచయిత శ్రీ సాదినేని రంగారావుగారు నాకు చాలరోజులనుండి పరిచయము. వారి చిన్నకుమారుడు చి॥ రాధాకృష్ణకు పెండ్లిచేశాను. నాకు వీరు వ్రాసిన "పెండ్లిసందడి" (వివాహపద్ధతి) తంతు పుస్తకముయిచ్చి చదివి తమ అమూల్యాభిప్రాయము వ్రాయమనిరి. ఆ పెండ్లిపుస్తకము చదువుచుండగా మేము చేయుచున్న పెండ్లిండ్లవలె అన్ని ప్రక్రియలు చాలాచక్కగా ప్రత్యక్షముగా చూచుచున్నట్లుగా, మదిగొలిపే విధముగా వ్రాశారు. ఈ పెండ్లిసందడి పుస్తకములో ప్రతిఘట్టము, ప్రతిసన్నివేశము, ప్రతిక్రియ ఆద్యంతము సుమధురము, మనోహరము, మనోజ్ఞముగా రంగారావుగారు వ్రాశారు. ఈ పెండ్లిపుస్తకము చాలా బాగున్నది. అభినందనీయులు రంగారావుగారు. ప్రతిఘట్టమునకు, ప్రతిసన్నివేశమునకు, ప్రతిసందర్భమునకు ఒకదానికొకటి తీసిపోని విధముగా వివరణగా, విఫలంగా వ్రాశారు. ఇందులో వైదిక వివాహ పద్ధతిననుసరించి వ్రాయబడినట్లు తెలియుచున్నది. ఈ పెండ్లిపుస్తకమంతా ఇదొక మరుపురాని మరచిపోలేని ఒక మధురమనోజ్ఞ ఘట్టము. ఒక సుమధుర సందేశము. ఇది ప్రతివాని ఇంటిలో వుండతగిన పుస్తకము. ప్రతి పురోహి తునకు (ఆచార్యునకు) హస్తభూషణము కాగలదు.

ఇంత మధురముగా పెండ్లిసందడి పుస్తకము వ్రాసిన రచయిత శ్రీ సాదినేని రంగారావును అభినందించుచూ, ఆశీర్వదించుచూ, వీరిని, వీరి కుటుంబ సభ్యులను ఆ సర్వేశ్వరుడు ఆయురారోగ్య భోగభాగ్యములిచ్చి కాపాడుగాక! అని ప్రార్థించుచున్నాను.

తెనాలి
30-10-2008

**ప్రతాపగిరి వెంకటరమణశాస్త్రి**
పురోహితులు, పుట్టావారివీధి చివర,
నాజరుపేట, తెనాలి-522201.



## అంకితము

సాక్షాత్తు పార్వతీపరమేశ్వర స్వరూపులైన శ్రీశైల మల్లిఖార్జున దంపతులకు, భద్రాద్రి సీతారాముల దంపతులకు, కలియుగ దైవం తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి పద్మావతి దంపతులకు, సహస్రాధిక వందనములతో అంకిత మిచ్చినది.

## కృతజ్ఞతాభివందనములు

ఎన్నాళ్ళనుండో ఈ పెండ్లిసందడి (వివాహపద్ధతి) పుస్తకము వ్రాద్దామను కొన్న కోరిక నెరవేరినందులకు ధన్యుడను. పెండ్లి రాత్రి జరిగిననూ, పగలు జరిగిననూ అరుంధతీ నక్షత్రమునే చూపుతున్నారు. పగలు పెండ్లి జరిగిన ప్రత్యక్ష దైవమైన శ్రీ సూర్యభగవానుని దర్శనముచేయించుట సమంజసము, ధర్మము కదా ! పగటి పెండ్లిలో కూడా అరుంధతీ నక్షత్ర సందర్శనమునే చేయించుచున్నారు. దీనికి కారణం తెలియదు. ఈ పెండ్లిసందడి (తంతు) లో 1. వైదిక 2. సంస్కరణ 3. సాంప్రదాయ 4. ఆధునిక (లౌకిక) వివాహ సమ్మేళన సమ్మిశ్రిత పద్ధతులు కలవు. ఈ గ్రంథ రచనకు ఉపయుక్త గ్రంథములు, రచయితలు 1. శ్రీమత్ దయానంద సరస్వతీ స్వామీజీ- వైదిక వివాహవిధి 2. అనువాదకులు పండిత శ్రీ (కావూరి) గోపదేవశాస్త్రి - సంస్కారవిధి 3. ఆచార్య పాలడుగు శేషాచలవర్మ-వైదికవివాహ తత్త్వ ప్రకాశిక 4. కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరి-వివాహవిధి 5. సత్పురోహితులు విన్నమనేని సోమయ్యవర్మ-వైదికవివాహవిధి మరియు సంస్కరణ వివాహదీపిక 6. డాక్టరు వెలగా వెంకటప్పయ్య-మన వారసత్వము 7. ఈనాడు పెళ్ళిపందిరిలు మొదలగు గ్రంథ రచయితలకు, యిందు అభిప్రాయములు వ్రాసిన డాక్టరు పాటిబండ్ల దక్షిణామూర్తిగారికి, వైదిక పురోహితులు శ్రీ రావివెంకరాయవర్మగారికి, వైదిక పురోహితులు ప్రతాప గిరి వెంకటరమణశాస్త్రి గారికి నా కృతజ్ఞతాభివందనములు. పెండ్లిసందడి పుస్తకమును అందముగా, సకాలములో ముద్రించి యిచ్చిన కీర్తి ఆఫ్‌సెట్ ప్రింటర్స్-తెనాలి వారికి నా వందనములు.

ఇంకను ఈ పెండ్లిసందడి పుస్తకములో చేర్చదగిన విషయములు, ప్రక్రియలు, లేక పుస్తకము గురించి మీమీ అభిప్రాయములు తెలియచేసిన మలిముద్రణలో చేర్చగలవాడను. ఈ పుస్తకము భవిష్యత్ వధూవరులకు, వధూవరులకు, వధూవరుల తల్లిదండ్రులకు, పురోహితులకు, పాఠక మహాశయులకు ఎంత ఉపయోగిపడినను నా కృషి సఫలమైనట్లు భావించెదను.

తెనాలి
1-11-2008

"భాషా ప్రవీణ" **సాదినేని రంగారావు** ఎం.ఎ.
రచయిత. సెల్ : 99490 52849

## విషయసూచిక

---

**సాదినేని రాధాకృష్ణ** బి.ఎ.
ప్లాట్ నెం. 327c, 5వలైను, మహాత్మాగాంధీ ఆటోనగర్, సోమసుందరపాలెం (పోస్టు)
తెనాలి మండలం, గుంటూరు జిల్లా. సెల్ : 99490 52849

# పెండ్లి సందడి
## (వివాహ పద్ధతి)

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణమ్ చతుర్భుజమ్
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ తారాబలమ్
చంద్ర బలమ్ తదేవ విద్యాబలమ్ దైవబలమ్॥
తదేవ లక్ష్మీపతే తేంఘ్రి యుగం స్మరామి॥

శ్లో॥ జానక్యాః కమలా కమలాంజలి పుటేయాః పద్మరాగాయితాః
న్యస్తారాఘవమస్తకేచ విలసత్కుంద ప్రసూనాయితాః
స్రస్తా శ్యామల కాయకాంతి కలితాఃయాః ఇంద్రనీలాయితాః
ముక్తాస్తా శుభదాభవంతు భవతాం శ్రీరామవైవాహికాః॥

శ్లో॥ శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్
అభంగుర విభూతి ర్నస్తరంగ యతు మంగళమ్॥

శ్లో॥ శ్రీరామపత్నీ జనకస్యపుత్రీ సీతాంగనా సుందర కోమలాంగీ
భూగర్భజాతా భువనైకమాతా వధూ వరాభ్యాం వరదాభవంతు॥

### పెండ్లంటె ...

పెండ్లంటే నూరేళ్ళ పంట. ఏడడుగుల అనుబంధం పెండ్లి. ఏడుజన్మల అనురాగబంధం పెండ్లి. రెండు మనసుల నూరేళ్ళ బంధం పెండ్లి. అంతులేని అనుబంధం పెండ్లి. కనిపెంచిన వారిని మురిపించి మరిపించేది పెండ్లి. విడిపోని అనుబంధం పెండ్లి రెండు హృదయ కుసుమాల సుగంధం పెండ్లి.



రెండు మనసుల అర్థం పరమార్థం పెండ్లి. రెండు జీవితముల ప్రేమానురాగాల అల్లికపేరే పెండ్లి. రెండు కుటుంబముల సంతృప్తి కొనసాగింపే పెండ్లి. శాంతి సౌభాగ్యముల ఉద్భవానికి సంసిద్ధతే పెండ్లి. పెండ్లంటే కేవలం శారీరక సంబంధము, బాధ్యతల పంజరము మాత్రమే కాదు. 'నా' అన్న తియ్యని భావనను కలుగజేసే కుటుంబమును ఏర్పరచుకొనే సోపానము అని భావము. పెండ్లంటే ఇద్దరి మనుష్యుల మధ్య, తద్వారా రెండు కుటుంబముల మధ్య ఏర్పడే బంధమనీ, పరస్పర విశ్వాసములు, గౌరవ మర్యాదలు, సహనము, సానుభూతి, ఓర్పు మొదలైన పునాదుల మీద నిర్మితమయ్యే అందాల సౌధమని భావము.

ఈ పెండ్లినే నేడు 1. పెళ్ళి 2. వివాహము 3. కళ్యాణము 4.పరిణయము 5. పాణిపీడనము 6. పాణి గ్రహణము 7. ఉద్వాహము 8. ఉపాయము 9. పరిగ్రహము 10. మనువు అను పదిపేర్లతో కూడా పిలుచుచున్నారు. 'వెయ్యి అబద్ధాలాడి ఒక పెండ్లి చెయ్యి' అన్న సామెత పాతకాలపుది. జీవితాంతము కొనసాగించవలసిన కలయిక కనుక తెలిసినవి తెలిసినట్లు, ఉన్నవి ఉన్నట్లు చెప్పి పరస్పర అంగీకారములతో, అవగాహనలతో పెండ్లిండ్లు జరిపించిన యెడల శాశ్వతంగా నిలచివుంటాయి. లేకపోతే నూరేండ్లు కొనసాగవలసిన నిండు జీవితము నరకమౌతుంది. పెండ్లంటే ఎవరికైనా ఆనందోత్సాహమే. ఎవరింట్లోనయినా జరిగే మంచి శుభకార్యమే. నేటి పెండ్లి తంతు, వివాహ పద్ధతి, వివాహ వేడుకలు, పద్ధతులు, సంప్రదాయాలు మొదలగు ఆచార వ్యవహారములు ఆంధ్ర దేశమంతటనూ యించుమించు ఒకే విధంగా వుంటాయివుంటున్నాయి. నేటి పెండ్లి ఆచార వ్యవహారములను గూర్చి తెలుసుకుందాము.

పూర్వము పెండ్లిండ్లు అయిదు రోజులుపాటు ఆడంబరంగా చేసెడివారట. నేడు అయిదురోజులలో పెండ్లి నిశ్చయం చేసుకొని పెండ్లిండ్లు చేయుచున్నారు.

పెండ్లంటే అతి పవిత్రమైన కార్యక్రమము. మహోన్నత మైనది. మానవుని మనుగడకు చాలా ముఖ్యమైనది. అందుకే "మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్" అని అన్నారు. పెండ్లిండ్లు స్వర్గంలో నిర్ణయించ బడతాయట. అందుకే ఒకరి ఆలి ఒకరికి కాదనెదరు.

శ్లో॥ కన్యావరయితే రూపం మాతావిత్తం, పితాశతమ్
బాంధవాః కులమిచ్ఛంతి, మృష్టాన్నమితి రేజనాః॥

కన్యవరుని అందము, తల్లిధనము, తండ్రిహోదా, బంధువులు కులము, తదితరులు షష్టిగా మృష్టాన్న భోజనము కోరెదరు. హిందూ సంస్కారములలో వివాహము అతి ముఖ్యమైనది. ప్రధానమైనది. ఋగ్వేదం పదోమండలంలోని వివాహ సూక్తంలో దీనిని గురించి అనేక వర్ణనలున్నాయి. అదర్వణవేదంలో వివాహానికి సంబంధించిన కర్తవ్యబోధ విపులంగా వున్నది. అందుకే వేద సమ్మతమైన వివాహం అత్యున్నతమైనదని చెపుతారు మన పెద్దలు. ఋగ్వేదంలోని వివాహసూక్తంలో వివాహధర్మాన్ని గురించి అద్భుతంగా వర్ణించారు.

**వివాహములు ఎనిమిది రకములు :**

శ్లో॥ బ్రాహ్మోదైవస్త థైవార్ష ప్రాజాపత్యస్తథా సురః
గాంధర్వోరాక్ష ససశ్చైవ పైశాచ అష్టమో అధమః॥

1. బ్రాహ్మ్యము 2. దైవము 3. ఆర్షము 4. ప్రాజాపత్యము 5. అసురము 6. గాంధర్వము 7. రాక్షసము 8. పైశాచము అని పెండిండ్లు ఎనిమిది రకములు కలవని మనుస్మృతి వలన దెలియుచున్నది. వీటిల్లో ఏదోక పద్ధతిలో పెండిండ్లు జరగడము పురాణాల్లోను, కావ్యాల్లోను మనం గమనించవచ్చును.

**1. బ్రాహ్మ్యము:–**

శ్లో॥ ఆచ్ఛాద చార్చ యిత్వాచ శ్రుతిశీలవతే స్వయం
ఆహూయదానం కన్యయా బ్రాహ్మోధర్మః ప్రకీర్తితః॥ (మను 3 అ 22 శ్లో)



సత్ప్రవర్తనతో మెలిగే వరుదుని అన్వేషించి అతనికి విలువైన ఆభరణాలతో అలంకరించిన కన్యను ఆమె తండ్రి కన్యాదానం చేస్తాడు. దీన్నే బ్రాహ్మము అంటారు. ఈ పద్ధతులన్నింటిలోకి విశిష్టమైనదని, ఉత్తమమైనదని శాస్త్రకారులు చెపుతున్నారు.

**2. దైవము:–**

శ్లో॥ యజ్ఞే తువతతే సమ్యగృత్విజే కర్మకుర్వతే
అలంకృత్యసుతా దానం దైవం ధర్మం ప్రచక్షతే॥ (మను3 అ24శ్లో)

విస్తారమగు యజ్ఞ కార్యమందు యజ్ఞ కర్మలను నడపుచుండ ఋత్విజుని అలంకరించి అలంకార యుక్తురాలగు కన్యను యిచ్చుట దైవ వివాహమని పెద్దలు జెప్పెదరు.

**3. ఆర్ష వివాహము:–**

శ్లో॥ ఏకంగో మిధునం ద్వేవా వరాదా దాయధర్మతః
కన్యాప్రదానం విధివదాత్పో ధర్మస్సఉచ్యతే॥ (మను3అ29శ్లో)

ఒక ఆవు ఒక ఆబోతు కలిసి (జంట) గోమిధనమగును. అట్టి గోమిధునము ఒకటిగాని, రెండు మిధునములుగాని వరుని వలన పుచ్చుకొని ధర్మపూర్వకముగా కన్యను ప్రదానమొనర్చుట అది ఆర్ష వివాహము. ఇందులో ఆవులను ఇవ్వటము కన్యాశుల్కములాగానే కన్పించినను వాటిని తీసికొనేది యజ్ఞయాగాదుల కోసం కనుక తప్పు లేదన్నారు శాస్త్రకారులు.

**4. ప్రాజాపత్యము:–**

శ్లో॥ సహుబౌ చరతాం ధర్మమితి వాచాను భాష్యచ
కన్యాప్రదాన యభ్యర్చ్య ప్రాజాపత్య విధిఃస్మృతః (మను3అ30శ్లో)

కన్యను వరుని అలంకరించి యజ్ఞశాల యందు పెద్దల సమక్షమున వీరుభయులు కలసి గృహస్థాశ్రమ ధర్మకార్యములను యధావిధిగా చేయుడని చెప్పి ఉభయులకు ప్రసన్నతాపూర్వకముగా పాణిగ్రహణము, సప్తపదిచేయుట ప్రాజాపత్యమందురు. దీనినే ప్రజాపతి ఋణము తీర్చుకోవటము అని కూడా అనెదరు. నేటి పెండ్లిండన్ని యీ విధానమునకు చెందినవే.

**5. అసురవివాహము:–**

శ్లో॥ జ్ఞాతిభ్యోద్రవిణం దత్వాకన్యాయై చైవశక్తితః

కన్యాప్రదానం స్వాచ్ఛంద్యం హ్యాసురోధర్మ ఉచ్యతే॥ (మను3ఆ31శ్లో)

కన్య తండ్రికిగాని, అతని తరపువారికిగాని, కన్యకుగాని యథాశక్తిగా ధనమొసగి హోమాదులొనర్చి కన్యను స్వీకరించుట అసురవివాహము అందురు. కన్యాశుల్క ఛాయలు యిందులో స్పష్టంగా కనిపిస్తాయి. శాస్త్రకారులు కొందరు దీనిని 'మానుషం' అనికూడా వ్యవహరిస్తారు. అయితే అప్పటిలోనే దీనిపై చాలా విముఖత వచ్చింది. కూతురను అమ్ముకున్న వాడి ముఖము చూడరాదని పద్మపురాణం ఘోషించినది కూడా. ఈ పద్ధతి ఆటవిక జాతులలో, కొండజాతులలో యిప్పటకిని కనపడుతున్నది.

**6. గాంధర్వవివాహము:–**

శ్లో॥ ఇచ్ఛయన్యోన్య సంయోగః కన్యయాశ్చ వరస్యచ

గాంధర్వస్సతు విజ్ఞేయోమైధున్యః కామసంభవః (మను3ఆ32శ్లో)

వధూవరులిద్దరూ ఒకరినొకరు యిష్టపడి, పెద్దలనుమతించకపోయినను లేక పరిస్థితులు అనుకూలించకపోయినను తమకు తామే తనువును, మనస్సును అర్పించుకోవటాన్ని గాంధర్వ వివాహమందురు. దుష్యంత, శకుంతల వివాహము యీ కోవకు చెందుతుంది.



**7. రాక్షస వివాహము:–**

శ్లో॥ హత్వాచిత్వాచ భిత్వాచ క్రోశంతీం రుదంతీం గృహ్యాత్

ప్రసహ్య కన్యాహరణం రాక్షసోవిధి రుచ్యతే॥ (మను3 ఆ 33శ్లో)

కన్యకు సంబంధించిన వారిని ఓడించి, మోసగించి, భయపెట్టి, చంపి కన్య దుఃఖించుచుండినను లెక్కచేయక బలవంతముగా తీసికొని వచ్చి పరిగ్రహించుట రాక్షస వివాహమందురు. కృష్ణుడు రుక్మిణిని, అర్జునుడు సుభద్రను యీ పద్ధతిలోనే పెండ్లి చేసుకున్నారని మనవారు ఉదాహరించెదరు. ఈ రెండు ఉదంతములలోనూ కన్యలు తొలుత వరుని వలసి వలపించు కొన్నవారే అన్నది గమనార్హము. ఏదియేమైన రాక్షస, పైశాచిక పద్ధతులలో జరిగే పెండిండ్లు యించుమించు దౌర్జన్య పూరితమైనవే. కృష్ణార్జునులను మినహాయించితే మిగిలినవాటిలో బలవంతుడు బలహీనులపై చేసే దుఃచర్యలకు నిదర్శనముగానే, యిటువంటి వివాహములను పరిగణించెదరు. పురాణాలలోను, చరిత్రలలోను యిటువంటి ఉదంతాలెన్నో చోటు చేసుకున్నాయి.

**8. పైశాచిక వివాహము:–**

శ్లో॥ సుప్తాం మత్తాం ప్రమత్తాం వారహోయత్రో పగచ్ఛతి

సుపాపిష్టో వివాహోనాం పైశాచశ్చాష్టమో ధమః॥ (మను3ఆ34శ్లో)

నిద్రించుచున్నట్టిగాని, మధ్యపానముచే మైమరచి ఒడలెరుంగని స్త్రీని బలాత్కారముగా సంయోగము చేయుట పైశాచము. ఇది అష్టమము. పాపిష్టము. నీచాతినీచమును, హేయమైనది.

1. బ్రాహ్మము 2. దైవము 3. ఆర్షము 4. ప్రాజాపత్యము యీ నాలుగు విధముల వివాహములు ఉత్తమములనియు ఆర్యుల మతము. ఇందువలన బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య అనబడు యీ నాలుగు విధముల వివాహములందు పాణిగ్రహణము జరిగినయెడల ఈ భార్యాభర్తలకు

జన్మించిన సంతానము శాఖోపశాఖలుగా వర్ధిల్లగలరు. శాశ్వత కీర్తిప్రతిష్ఠలు సంపాదించగలరు.

**మనువుకు మనసే కాదు వయసూ ప్రధానమే :**

మన హిందూ వివాహయాక్టు ప్రకారము అమ్మాయికి 18 ఏళ్ళు, అబ్బాయికి 21 ఏళ్ళు నిండితేనే వివాహమునకు అర్హులుగా పరిగణించవలెను. ముస్లిము వివాహ చట్టము, క్రైస్తవ వివాహ చట్టము కూడా ఇదే విషయమును స్పష్టముగా చెప్పినవి. చెబుతున్నాయి. అంటే యువతీ యువకులు శారీరకంగానే కాక, మానసికంగాకూడా వికాసము పొందిన తరువాతే పెండ్లాడవలయునన్నది వీటి ఆంతర్యము. వాస్తవమునకు ఋగ్వేదకాలంలో కూడా యిదే పద్ధతి అమలులో వుండెడిది. పూర్తి యవ్వనములో నున్న యువతీ యువకులకే అప్పట్లో పెండ్లిండ్లు జరిగెడివి. శారీరకముగా గర్భధారణకు తగినంతగా ఎదిగిన అమ్మాయిలనే ఆ కాలములో 'కన్య' అని వ్యవహరించెడివారు. అటువంటి కన్యలనే వివాహమునకు అర్హురాలుగా భావించెడివారు. ఆ కాలంలో అమ్మాయిలు కూడా వేదమాచరించెడివారు. వారికీ అబ్బాయిలకు వలెనే ఉపనయనము చేసెడివారు. ఈ తతంగము అంతా పూర్తి అయ్యేసరికి వారికి పెండ్లీడు వచ్చేసెడిది.

రామాయణంలో సీతాదేవికాని, భారతంలో సుభద్రాదేవికాని, ద్రౌపదీదేవి కాని వీరందరూ నిండు యవ్వనములోనే పెండ్లాడటము మనమిక్కడ గుర్తు చేసుకొనవచ్చును. ఆయుర్వేద వైద్య విజ్ఞానమునకు పట్టుకొమ్మగా స్వామీ దయానంద సరస్వతీ స్వామీజీ అభివర్ణించిన 'శుశ్రుత' కూడా అదే చెప్పుచున్నది. యువతికి 18 యువకునికి 25 ఏళ్ళు దాటితేనేగాని వివాహార్హత లభిస్తున్నదని, అందులో ఖండితముగా చెప్పినారు. శారీరక, మానసిక పరిపక్వత పొందిన యువతీ యువకులు ఏకమవ్వటము ద్వారానే ఆరోగ్య



కరమైన సమాజం ఆవిర్భవిస్తున్నదన్నదని నిర్వివాదము. సుదృఢమైన సంతాన సృష్టిధర్మ పరిరక్షణ వంటి బాధ్యతలకు ఆలవాలమైన గృహస్థాశ్రమములో కీలకపాత్ర పోషించే భార్యాభర్తలు ఎంత చక్కగా ఉండవలెనో ఆలోచించి మన పెద్దలు పెండ్లికి యిలా ఒక వయస్సు నిర్ణయించిరి. ఆ వయస్సులో పెండ్లాడితేనే సులక్షణమైన సమాజాభివృద్ధికి దోహదం చేయవచ్చునని తేల్చి చెప్పినారు.

**బాల్యవివాహముల ప్రవేశము :**

పెద్దలు ఎంతో ముందుచూపుతో పెండ్లీడు విషయములలో జాగ్రత్తలు తీసుకొన్నా దురదృష్టవశాత్తు మధ్యలో బాల్యవివాహములు చొరబడ్డాయి. కొందరి స్వార్థము, మరికొందరి అమాయకత్వము వీటి విస్తరణకి ఎంతో దోహదము చేసినవి. వేదములకు పురాణేతిహాసములకు విపరీత వ్యాఖ్యానములు చేసి పనితనములో పిల్లలకు బొమ్మల పెళ్ళిళ్ళులాంటివి చేయడము మొదలుపెట్టిరి. సుమారుగా క్రీస్తుకు పూర్వము 4వ శతాబ్దము నుండి వీటి జోరు అధికమైనదని చెప్పకొనవచ్చును. ఈ పరిస్థితికి కూడా కొన్ని సామాజిక చారిత్రక కారణములు లేకపోలేదు. పరదేశీయుల దండయాత్రల తరచూ రాజుల మధ్య యుద్ధములు జరిగే ఆ రోజులలో శత్రువులకు చిక్కన యవతులను చెరపట్టడము ఆనవాయితీగా వుండెడిది. అలాంటి దుస్థితి తమ పిల్లలకు రాకూడదని అందరూ భావించెడివారు. అందుకే ఆడపిల్లల తల్లిదండ్రులు అలాంటి ఉపద్రవములు సంభవించ కుండగా వుండవలయుననే ముందు జాగ్రత్తగా తమ బిడ్డలకు వీలైనంత తొందరగా పెండ్లి చేసి అత్తవారింటికి పంపించెడివారు. ఈ దృష్టితోనే అంతకు ముందు వరకూ కొనసాగిన కొన్ని సాంప్రదాయములను తుంగలో తొక్కేసెడివారు. అందుకు ఉదాహరణ:- బాలికలు వేదములు చదువుటకు

అనర్హాలు అని తీర్మానించడమే. ఎందుకంటే అవన్నియూ వాళ్లు చదువుకొనుచూ కూర్చుంటే వయస్సు వచ్చేస్తుందని దానివలన సమస్యలు వస్తాయని యిలా జాగ్రత్త పడ్డారన్నమాట. అదీగాక ఆ రోజులలో బౌద్ధమతము కూడా బాగుగా వ్యాప్తిలో వుండెడిది. చాలా మంది యువతీ యువకులు అవైపు ఆకర్షితులై దానిని స్వీకరించెడివారు. ఇల్లూ వాకిలీ వదలి పరివ్రాజకులుగా మారిపోయెడివారు.

దీనిని అడ్డుకునేందుకు పెద్దలు శాయశక్తులా ప్రయత్నించెడివారు. అందుకే వారికి ఊహ తెలియని వయస్సులోనే వివాహము చేయడము మంచిదని భావించెడివారు. బాలిక పుష్పవతి అయిన తరువాత ఆమె దేహము మీద భూతప్రేతాదులు ఆవహిస్తాయని వాటివలన కుటుంబమునకు అరిష్టమని మరికొందరు పండితులు ప్రచారము చేసెడివారు. ఆడపిల్లకి ఎనిమిది నుండి పదేళ్లవయస్సు మధ్య వివాహము చేయవలయునని బ్రహ్మ పురాణము పేర్కొన్నది. రజస్వల కాకముందే తమ కూతురికి పెండ్లిచేయని తల్లిదండ్రులు నేరుగా నరకమునకు పోవుదురని యాజ్ఞవల్క్యుడు వంటి మహనీయులు చెప్పినారని చెప్పడముతో చాలమంది అదే నిజమని నమ్మి బాల్యవివాహముల వైపు మొగ్గుచూపిరి. బాలికలకు రక్షణ లభిస్తుందనే భ్రమ కూడా ఎక్కువమందిని వీటికి పురికొల్పెడిది. అందులకే ఎనిమిదేళ్ళలోపే ఆడపిల్లలకు పెండ్లిచేసేడివారు.

## విదేశములలోను :

బాల్యవివాహముల జాడ్యము మనదేశములోనే కాదు ఐరోపా ఆఫ్రికా ఖండములలోనూ వుండెడిది. ఇంగ్లండులో 1929 దాకా ఆడపిల్లలకి 12, మగపిల్లలకు 14 సంవత్సరములు వివాహ వయస్సు పరిగణించెడివారని ఫర్నివత్ అనే రచయిత తన "చైల్డ్‌మ్యారేజెస్" అనే గ్రంథములో స్పష్టముగా



పేర్కొన్నాడు. ఆఫ్రికాలోని కొన్ని అటవీజాతులలో పసిగుడ్డుకే పెండ్లి నిర్వహించడము ఇప్పటికీ సంప్రదాయముగా కొనసాగుచున్నది. ఏదిఏమైనా 20వ శతాబ్దము పూర్వము వరకూ యధేచ్ఛగా కొనసాగిన బాల్యవివాహముల పరంపరకు కందుకూరి, చిలకమర్తి వంటి సంస్కర్తల పుణ్యామా అని అడ్డు కట్టపడినది. వారి కృషికి కొందరు బ్రిటీషర్లు కూడా సహకరించడముతో బాల్య వివాహముల దుస్సంప్రదాయమునకు కాలము చెల్లినది. చెదురుమదురుగా తప్ప దాదాపుగా యిది అటకకెక్కాయనే చెప్పవలయును.

## పెండ్లి పవిత్రత ఒకటే అయినా పద్ధతులే వేరు :

పెండ్లంటే నూరేళ్ళ పంట. అంటే నిండునూరేళ్ళు సహవాసానికి, సహజీవనానికి వేసే తొలిపునాది. అయితే రెండు జీవితములను ఒక్కటిచేసే వివాహబంధమునకు సంబంధించిన వేడుకలు. సంప్రదాయములు ప్రాంతములను బట్టి దేశములను బట్టి రకరకములుగా వుంటాయి. ఆంధ్ర దేశములోని కొన్ని ప్రాంతాలలో బియ్యమును తలంబ్రాలుగా వాడితే, మరొకొన్ని చోట్ల జొన్నలను తలంబ్రాలుగా వాడెదరు. అటులనే కొన్ని సాంప్రదాయముల ప్రకారముగా పాపిటిలో సింధూరమే వివాహితకు చిహ్నముగా భావిస్తుంది. కొన్ని ప్రాంతములలో మనమెంతో ప్రాధాన్యమిచ్చే తాళిబొట్టు సంప్రదాయమే వుండదు. ఇలా ప్రాంతములకు అనుగుణముగా సంప్రదాయములు, ఆచార వ్యవహారములు మారినప్పటికి వాటి పరామార్థము ఒక్కటే. అదే రెండు జీవితములను ఒక్కటిచేయడము.

## బౌద్ధ సంప్రదాయములో ఎలావున్నది? :

బౌద్ధసాంప్రదాయ ప్రకారముగా ప్రార్థనతో వివాహప్రక్రియ ప్రారంభమౌతుంది. తరువాత బౌద్ధులు ఉపయోగించే జపమాలను వధూవరులకు బహుకరించెదరు. ఆ తరువాత ప్రమాణముల కార్యక్రమము

వుంటుంది. బౌద్ధగురువు చెప్పినట్లుగా వివాహ వాగ్ధానములను చేయవలెను. వివాహసమయములో పన్నీరు అగరువత్తులను విస్తృతముగా ఉపయో–గించెదరు. వధువు నాణ్యమైన తెల్లని పట్టుతో తయారుచేసిన ప్రత్యేక దుస్తులను ధరిస్తుంది. దానిపై కొంగలు, సముద్రపు కెరటములున్న పొదవాటి ఫైన్‌వృక్షముల డిజైన్లుంటాయి. ఇవన్నీ కూడా అంతులేని ఆనందమునకు సంతోషమునకు ప్రతీకలని పేర్కొనెదరు.

జపనీయుల సాంప్రదాయములో పెండ్లి సందర్భముగా వధువు శిరస్సున ప్రత్యేకమైన విగ్‌ను ధరిస్తుంది. ఒకసారి యీ పెండ్లిదుస్తులన్నీ కూడా వంశ పారంపర్య సంప్రదాయముగా కూడా ధరించు చుండెదరు. ఇక వరుని విషయమునకు వస్తే ప్రత్యేకమైన తెల్లని వస్త్రముతో తయారైన కిమోనోను ధరిస్తాడు. పాదరక్షలు ఇతర అలంకరణములన్నీ కూడా ఒక రకమైన విలక్షణతను కలిగివుంటాయి. తెలుగు వారి సంప్రదాయములో మాదిరిగానే వధువు వివాహ సమయములో నాలుగైదుసార్లు దుస్తులు మార్చుకోవలసి వుంటుంది. చివరకు ఆమె ధరించే ఉడుపులు పాశ్చాత్య దేశములవారు వేసుకొనే ఈవినింగ్ డాన్సింగ్ గౌనులా వుంటాయి.

## చైనీయుల పద్ధతి :

చైనా విషయమునకు వస్తే వారు ధరించే పెండ్లిదుస్తులు చాలా విలక్షణంగా వుంటాయి. పెండ్లి తతంగము మొదలైన దగ్గరనుండీ వధూవరులిద్దరూ ఛత్రఛాయలోనే గడపవలసి వుంటుంది. అంటే ఎవరో ఒకరు వారివెనుక గొడుగు పట్టుకొని వుంటారు. జపనీయులు, చైనీయులు, కొరియనులు బౌద్ధసాంప్రదాయ ప్రకారముగానే వివాహములు చేసికొనెదరు. కొన్నికొన్ని పద్ధతులు మాత్రము భిన్నముగా వున్నప్పటికీ పెండ్లి తంతు అంతా దాదాపు ఒకలాగానే వుంటుంది.



## యూదుల ఆచారములు ఏమంటున్నాయి :

వీరు పెళ్ళిని "ఖుద్దీసీన్"గా పేర్కొనెదరు. అంటే వివాహమనెడిది కేవలము సామాజికపరమైన అంశము మాత్రమే కాదనీ దైవబలముచేత కుదిరిన అత్యంత పవిత్రమైన బంధమని యూదులు ప్రగాఢముగా విశ్వసించెదరు. సంబంధములు ఖరారు అయ్యే ప్రథమ ఘట్టమును వీరు " సిద్దుష్" అనెదరు. పిల్ల పిల్లవాడు ఒకరికొకరు నచ్చిన తరువాత పెద్దలు సమావేశమై పెండ్లి తేదీని సమయమును ఖరారు చేయుదురు. అయితే పెండ్లి కంటెముందే "రిసెప్షన్" ఏర్పాటుచేయడము వీరి ప్రత్యేకత. ఈ సందర్భముగా అతిథి అభ్యాగతులకు కమ్మని విందులు చేయుదురు. పెండ్లి కుదిరిన తరువాత అమ్మాయి అబ్బాయి ఇద్దరూ కలిసి షాపింగ్ తదితరములు చేసినప్పటికినీ ముహూర్తమునకు సరిగా పదిరోజుల ముందునుండీ వారు ఒకరికొకరు చూచుకొనరాదు. మాట్లాడుకొనరాదు. ఇలాచేయడము వలన వారిరువురకు ఎడబాటు బాధ తెలుసుకుంటారన్నది యూదుల విశ్వాసము. "మిష్నయిక్" చట్టము ప్రకారముగా వారి వివాహములు జరుగుతాయి. "అర్మెయిన్" భాషలో వుండే "కెటువా" పత్రము పురుషుడి బాధ్యతలు ఏమిటన్నది విశదీకరిస్తుంది. అనివార్య పరిస్థితులలో ఇద్దరూ విడిపోతే అప్పుడు అందచేయవలసిన సహాయము ఇతరత్రా సహకారము గురించి కూడా వివరిస్తుంది. ఈ పత్రముపై ఉభయులు సంతకములు చేయుదురు. అనంతరము అల్పాహార విందు వుంటుంది. ఈ సందర్భముగా అతిథులు సురాపానము కూడా చేయుదురు. ఆ తరువాత అసలు తంతు మొదలవుతుంది. చక్కటి పల్చని మేలిముసుగును తీసికొని వరుడు తనతరపువారితో కాబోయే మామగారితో కలిసి వధువు ఆసీనురాలై వున్నచోటికి వెళతాడు. అక్కడ చక్కగా తయారై మహారాణిలా ఓ పెద్ద సింహాసనములో ఆసీనురాలైవున్న నవవధువుకు మేలిముసుగును అలంకరిస్తాడు. అంతే దానితో పెండ్లి పూర్తి అయిపోయినట్లే.

## గృహస్థాశ్రమ ధర్మమును చాటే వివాహమహోత్సవము :

పెండ్లంటే నూరేళ్ళపంటని పెద్దలన్నారు. అది నిజమే. హైందవ సంస్కృతిలో వివాహము అతి ప్రధానమైనది. గృహస్థాశ్రమ ధర్మమునకు నాందీ ప్రస్థావనగా పరిగణించే యీ వైవాహిక విధి సంస్కారములలో పన్నెండోదైనా ప్రతిమనిషి జీవితములో అతి ముఖ్యమైనదనడములో సందేహము లేదు. విజ్ఞానపరముగాను, సామాజికపరముగాను కూడా మన వివాహవ్యవస్థ అత్యున్నతమైనదని ప్రపంచము యావత్తూ కొనియాడడము గమనార్హము. వేదములలో అతి ప్రాచీనమైన ఋగ్వేదములో దీని ప్రస్థావన వున్నది. అందులో పదో మండలములోని ఎనబై అయిదో సూక్తమును "వివాహసూక్తము"గా వ్యవహరించెదరు. అధర్వణ వేదం పద్నాలుగో కాండలోని మొదటిసూక్తములోను వివాహ ప్రస్థావన కనపడుచున్నది. దీనిని గమనించే ఋషులు, పరాశరాది మహర్షులు, శాస్త్రకారులు, సూత్రకారులు యీ వ్యవస్థను మరింత పటిష్టముగా తీర్చిదిద్దే ప్రయత్నము చేసిరి.

సామాజిక జీవనమునకు పునాది కుటుంబవ్యవస్థ. దానికి బీజము వేసేది వివాహము. అందుచేత ఆ రోజులలోనే దీనికెంతో ప్రాధాన్యము లభించినది. ఇక్కడ గృహస్థాశ్రమమును స్వీకరించే వ్యక్తి శక్తి సామర్థ్యములు అతి ముఖ్యము. ఎందుకంటె అతను తనతోపాటు తన కుటుంబసభ్యులందరి అలనాపాలనా చక్కగా చూడవలెను. తనతోపాటు వారందరి బరువు బాధ్యతలను మోయవలెను. తను సంతోషముగా ఉండడముతోపాటు తనవారందరను సంతోషపెట్టవలెను. తనబిడ్డలేకాదు మళ్ళీ వాళ్ళబిడ్డలకు కూడా విద్యా బుద్ధులు చెప్పించవలెను. వారిని సైతము గృహస్థాశ్రమ స్వీకరణకు అర్హులయ్యే విధముగా తీర్చిదిద్దవలెను. ఇవన్నియు సాధించుటకు ఎంతో శక్తి సామర్థ్యము కావలెను. కష్టనష్టములు ధైర్యముగా ఎదుర్కొనే గుండెదిటవు కావలెను. సమస్యలను పరిష్కరించుకోగలిగే ప్రజ్ఞ కావలెను. సహనము కావలెను.



సహజీవనము చేసే తోటి వ్యక్తులపట్ల సహానుభూతి కావలెను. సమాజము పట్ల బాధ్యత కావలెను. ఇవన్నియును కలిగిన వ్యక్తి తన సుఖసంతోషములు అనుభవించడమేగాక తన కుటుంబమును సుఖపెడతాడు. తాను జీవించే సమాజమునకు ఆదర్శమౌతాడు. ఆభరణమౌతాడు.

వివాహమును, వివాహవ్యవస్థను ప్రాచీన సమాజములు చాలా గౌరవించెడివి. ఇందుకెన్నో కారణములు కలవు. గురూపదేశములు బోధనలతో ముడిపడిన మన సంస్కృతులకు వ్యవసాయమే ప్రధాన భూమిక, భూములు, గోవులు, ధనధాన్యములు, పాడిపంటలు పుష్కలముగా సమకూర్చు కోవడము గౌరవముగా భావించెడివారు. అంతేకాదు పెద్ద కుటుంబములు కలవారిని, బంధుబలగము అధికముగా వున్నవారిని కూడా సమాజము గొప్పవారిగా పరిగణించెడిది. గౌరవించెడిది. ఎక్కువ మంది పిల్లలనుగన్న తల్లిని చల్లని తల్లి అంటూ కొనియాడెడివారు. గౌరవించెడివారు. ఎందుకంటె అధిక మానవవనరుల ద్వారా పెద్దమొత్తములో ఆదాయము గడించవచ్చుననేది అప్పటి నమ్మకము.

అసలు సంతానమే సంపదగా భావించే సంప్రదాయము ఆరోజులలో కొనసాగెడిది. వివాహ సంబంధములు కలుపుకొనే విషయములలో కూడా పెద్ద కుటుంబములకే అధిక ప్రాధాన్యము లభించెడిది. అందుకే వివాహ మహోత్సవములు కేవలము ఒక కుటుంబమునకు పరిమితము కాక సామాజిక వేడుకలుగా రూపుదిద్దుకొన్నాయి. ఇరు కుటుంబముల నుంచి వచ్చిన ఇద్దరు వ్యక్తులు దంపతులు కావడము, క్రమముగా వారి పిల్లలకు పిల్లలు అలా అలా వంశము ప్రవర్థమానము అవడము తెలిసినదే. ఈ ప్రక్రియ వెనుక సమాజాభివృద్ధి సుస్పష్టముగా గోచరిస్తున్నది. సంతానాభివృద్ధి ద్వారా మానవ వనరుల పెంపు, మానవ వనరుల ద్వారా ఆదాయము ఉపాధికల్పనల పెంపు ఇలాగన్నమాట.

## ఋణత్రయమునకు విముక్తి వివాహమే :

సామాజికాభివృద్ధి విషయము యిలా వుండే వివిధ నమ్మకములు, మతాచారములు, ఆచార వ్యవహారములకూ వివాహమే కేంద్ర బిందువు. దేవతలను, పితృదేవతలను సంతోష పెట్టవలయుననినా సంతృప్తి పరచవలయుననినా సంతానవంతులే అర్హులు. ఆ అర్హత సంపాదించవలయు నంటె వివాహము తప్పనిసరి. ఉదాహరణకు పుత్రులు లేనివారు పున్నామనరకమునకు పోయెదరు. అనెడిది చాలా మంది నమ్మకము. మరి పుత్రులను పొందాలంటే వివాహము కావలసినదేగదా. ఈ రకముగా కూడా వివాహమునకు మన సమాజములో అత్యున్నత ప్రాధాన్యము సమకూర్చిపెట్టిరి. హైందవ ధర్మము ప్రకారముగా ప్రతిమనిషికి మూడు ఋణాలుంటాయి. వీటినే ఋణత్రయమనెదరు. 1. సామాజిక ఋణము 2. పితౄణము 3. దేవతాఋణము అనెడివి. వీటిలో కూడా సామాజిక ఋణము కంటె పితృ, దేవతా ఋణములు అతి ముఖ్యమని, వీటిని ఎలాగునైనా తీర్చవలయునని పెద్దలు చెప్పెదరు. సంతానము పొందడము ద్వారా వివాహితులకే వీటిని చెల్లించుకొనే అర్హత లభిస్తుందని చెప్పడవు వారిలోని గడుసుతనమునకు తార్కణము గడుసుదనము అనడముకన్నా వారి ముందుచూపు సామాజిక బాధ్యతలకు నిదర్శనము అనడము సముచితము. సమాజాభివృద్ధికి, కుటుంబ వ్యవస్థకు భూమికగా పేర్కొనే వివాహమునకు ప్రాధాన్యమును సంతరింపజేయుటకు ప్రాచీనులు యింత పరిశ్రమ చేసిరన్నమాట.

## ధర్మార్థకామమోక్షములకు యిదే బాట :

వేరు వేరు కుటుంబముల నుండి వచ్చిన స్త్రీ పురుషులు ఏకమై సంతానా–భివృద్ధికి శ్రీకారము చుట్టడముతో వివాహమన్న పదమునకు పూర్ణత్వము రాదు. ధర్మ, అర్థ, కామ, మోక్షమనే నాలుగు ప్రధాన ధర్మములను



సక్రమముగా అనుసరించడము ద్వారానే అది పరిపూర్ణమౌతుంది. "కామము" అనెడి దానికి యిందులో మూడవస్థానము కేటాయించడము ద్వారా, అదొక్కటే ప్రధానముకాదని ప్రాచీనులు మనకు చెప్పకనేచెప్పిరి. ధర్మ, అర్థములకు తొలిస్థానమిచ్చి వాటి ప్రాధాన్యము ఏమిటో సుస్పష్టముగా వెల్లడించిరి. అర్థము (సంపద) కన్నా ధర్మము గొప్పదనీ, కామము కన్నా సంతృమృద్ధి మిన్ననీ చెప్పిరి. దానాదీనా ధర్మమునకు అత్యున్నత స్థానమిచ్చిరి. ధర్మమును నీవు కాపాడితే ధర్మము నిన్ను కాపాడుతుందని ( ధర్మో రక్షతి రక్షితః) సామాజిక శాస్త్రమును నూరిపోసిరి. అయితే ధర్మ నిర్వహణకి ప్రక్కన సహధర్మచారిణి వుండాలనిరి. తద్వారా భార్య ప్రాధాన్యమును విశదీకరించి చెప్పిరి. భార్యలేకుండగా పురుషుడు ఏ విధినీ నిర్వహించే అవకాశము లేదనిరి. అందులకే ఉత్తర రామాయణములో సీతాదేవిని అడవులకు పంపివేసిన శ్రీరాముడు ఆ తరువాత అశ్వమేథయాగము వేళ భార్యలేని కారణముగా ప్రక్కన కాంచన సీతను పెట్టుకొని యాగపు పని పూర్తిచేసినాడు. దీనిని బట్టి పురుషుడి జీవితములో భార్యస్థానము ఎంతటి విశిష్టమైనదో సామాజిక వ్యవస్థలో వివాహ ప్రక్రియ ఎంతటి ఉన్నతమైనదో మన పెద్దలు తెలియచెప్పిరి.

## కంటికింపు సంస్కృతీ సంప్రదాయముల మేళవింపు :

"పందిట్లో పెళ్ళవుతన్నదీ ……… కనువిందవుతున్నదీ" కొన్నేళ్ళ క్రితం వరకు దాదాపు ప్రతి పెండ్లిపందిట్లో విన్పించిన పాటయిది. నిజమే. మనిషికి కనువిందు చేసే వేడుకలలో పెళ్ళే ప్రధానమైనది. దాని తరువాతే మిగిలినవన్నీ. రెండు జీవితములను ఒకటిగా ముడివేసే వివాహ బంధము పవిత్రమైనదే కాదు. సామాజికముగా అతి ప్రధానమైనది కూడా. హిందూ మతము కావచ్చు, ఇస్లాము మతము కావచ్చు, క్రైస్తవ మతము కావచ్చు మతమేదైననేమి? మనువు అనెడిది ఒక పవిత్ర బంధము. అందమైన

అనుబంధము. తరతరాల సంబంధము ఏడడుగుల సంబంధము మధురమైన ఆనందము. ఈ పెండ్లి వేడుక ప్రతిఘట్టము ప్రతి సన్నివేశము, ప్రతి సందర్భము ఆద్యంతము రసవత్తరము సుమధురము, మనోజ్ఞము, కమనీయము, కన్నుల పండుగ.

**సార్వత్రిక సంతోషము – సంబరము :**

వివాహవేడుకలోని ప్రత్యేకత ఏమంటే? ఇదోక సార్వత్రిక సంతోషము ఆనందము సంబరము. కేవలం పెండ్లిపీటల మీద కూర్చున్న వధూవరులే కాదు, కుటుంబ సభ్యులకే పరిమితము కాదు. తిలకించుచున్న బంధుమిత్రులకు, అతిథులకు, అభ్యాగతులకు ఆహ్వానితులందరకూ అది కమనీయవేడుకే. కన్నుల పండుగే. ఎన్నిసారులు చూచినను నిత్య నూతనముగా కనిపించే మహత్తర సంబరమే. పీటలమీద దృశ్యాలు ఒకటొకటి జరిగిపోతూ వుంటే వివాహితులకు తమ పెండ్లి నాటి మధురస్మృతులు, జ్ఞాపకములు, ముచ్చట్లు గుర్తుకువస్తాయి. తమ పెళ్ళి ఇంకెంత వైభవముగా జరుగుతుందో అనే ఆలోచనే అవివాహితులకు గిలిగింతలు పెడుతుంది. మంగళమేళము, సన్నాయివాయిద్యములు, పురోహితుడి వేదమంత్రములు మంద్ర మంద్రముగా వినిపించుచుంటే ప్రతిఒక్కరూ తన్మయావస్థలో ఆ వేడుకను తిలకించి పులకించు చుండెదరు.

**చతురులు, చలోక్తులు, సరదాలపరదాలు :**

ఇరుపక్షముల బంధువులు, మిత్రులు శ్రేయోభిలాషులు అందరూ పెద్ద సంఖ్యలో ఒకచోట చేరడముతో ఎటుచూచినా నవ్వుల పువ్వులే సరదాల పరదాలే. జోకులు పేల్చుతూ, చలోక్తులు విసురుతారు, చతురులు ఆడుచూ పరస్పరము ఆటపట్టించుకొనుచూ సరస సల్లాపముతో సాగిపోతూ వుంటే చూచెడివారికి కన్నుల పండగే అవుతుంది. ఈ సంతోషము, సరదా శాశ్వతమైతే బాగుగా వుండుననిపిస్తుంది. వయోవృద్ధులు, పెద్దలు కొందరు



కబురులతో కాలక్షేపము చేయుచుండెదరు. మరికొందరు చిన్న పిల్లల ఆట పాటలతో బిజీ అయిపోయెదరు. యువకులు అందమైన అమ్మాయిల చుట్టూ బొంగరములలా తిరుగుచూ వారి దృష్టిలో పడడానికి ప్రయత్నించు చుండెదరు. అమ్మాయిలు వీరిని పట్టించుకోనట్లు పైకి అనిపించినా వాళ్ళూ వీళ్ళ చేష్టలను ఒరకంట గమనించుచునే వుండెదరు. మరోకప్రక్క యిక్కడే కలసిన బంధుమిత్రుల పరిచయ కార్యక్రమములు ధారావాహికముగా సాగిపోతుంటాయి. కొందరు ఆడపిల్లల తల్లిదండ్రులు పెళ్ళిసంబంధములు మాట్లాడుకొనెదరు. అందుకోసము బంధుమిత్రుల సాక్షిగా చర్చలు సాగించెదరు. మరియొకప్రక్క వాడిగా వేడిగా రాజకీయ చర్చలు సంగతులు, ఇంకొక ప్రక్క సినిమాలకబుర్లు ఎటు చూచినా పెండ్లి సందడే సందడి. ఎవరి కాలక్షేపము వారిది. ఎవరి సరదా వారిది. అయితేనేమి? భిన్నత్వములో ఏకత్వమన్నట్లు అందరిది ఒకటే సంతోషము ఆనందము మహదానందము.

**ప్రయాసే అయినా ప్రమోదం జాస్తి :**

"ఇల్లుకట్టి చూడు పెండ్లిచేసి చూడు" అని మన పెద్దలు అంటుండెదరు. ఇంటికి కావలసిన స్థలము ఎంపిక చేసుకోవడము, సామగ్రి సమకూర్చు కోవడము, సమగ్రముగా సక్రమముగా కూలీలతో పనిపూర్తి చేయించు కోవడము, ఇదంతయు తేలికగా పూర్తి అయ్యే విషయము కాదు. వ్యయ ప్రయాసలతో కూడుకొన్నది. ఏమాత్రము పొరపాటు చేసినా కట్టడము నిట్ట నిలువునా కూలిపోతుంది. పెండ్లికూడా అంతే. పెండ్లిచూపులు మొదలు పదహారురోజుల పండుగ పూర్తి అయ్యేవరకూ పెండ్లితంతులో ఎన్నెన్నో అధ్యాయములు, ఎన్నెన్నో అంకములు, మరెన్నో సంఘటనలు, మరెన్నో సందర్భములు, మరెన్నో ఆటంకములు. తగిన జాగ్రత్తతో మెలకువగా ఒద్దికగా సంయమనముతో ఓర్పుతో, నేర్పుతో అన్నిటినీ చక్కదిద్దుకు రాకపోతే నిండు జీవితములు పేకమేడలులా కూలిపోతాయి. అందులకే "ఇల్లుకట్టి చూడు పెండ్లిచేసి చూడు" అని యీరెంటికి లింకుపెట్టి మనపెద్దలు సామెత కట్టిరి.

## వధూవరుల అన్వేషణే అత్యంత కీలకము :

వధువుకు తగ్గ వరుని కోసము, లేదా వరునికి తగ్గ వధువు కోసము సాగే అన్వేషణ వివాహప్రక్రియలో అత్యంత కీలకమైనది. అల్లుడిని వెదకి తేవాలంటే ఆడపిల్ల తండ్రికి ఏడుచెప్పుల జతలు అరిగిపోతాయనెడిది సామెతే అయినా అక్షరసత్యము కూడా. ఆధునిక కాలములో పత్రికలు, ఎలక్ట్రానిక్ మాధ్యమములు, వివాహాది పరిచయవేదికలను నిర్వహించడము, కొన్ని సంఘములు, అభ్యుదయ సంఘములు, సేవాసంఘములు వధూవర పరిచయ వేదికలను ఏర్పాటు చేయడము వలన గతకాలముతో పోల్చిన సంబంధములు కురుర్చుకోవడములో యిబ్బందులు కొంచెము తగ్గినా పూర్తిగా తగ్గాయని చెప్పుకోవడమునకు వీలులేదు. పెండ్లికి అటు ఏడు తరములు, ఇటు ఏడు తరములు పరిశీలించాలనెడిది మన పెద్దలు చెప్పిరి. వధూవరుల ఎంపికలో ప్రతివిషయమును, ప్రతి చిన్న అంశమును సునిశితముగా పరిశీలించ వలయునని చెప్పడమే దీని భావన.

కొందరు వధూవరుల జాతకములు కూడా కూలంకషముగా పరిశీ–లించెదరు. వాటిలో తేడాలున్ననూ, సరిదిద్దలేని యిబ్బందులు పొడచూపినను అంతే సంగతులు. అన్ని విధముల నచ్చిన సంబంధమైనను సరే వదలివేసు కొనెదరు. జాతకములు, గ్రహస్థిలును కొందరు మూఢనమ్మకములుగా కొట్టి పారవేసినను, ఆ నమ్మకము వెనుక అంతరార్థము ఆ జంట కలకాలము కనులపంటగా వైవాహిక జీవితము గడపవలయునన్నదే అనడములో సందేహము లేదు. ఎందుకంటే "పెండ్లంటే నూరేళ్ళ పంట" కనుక ఏ చిన్న పొరపాటు జరిగిననూ తిరిగి దిద్దుకోవడము సాధ్యము కాదు గనుక. అందులకే అంత్యనిష్ఠూరము కన్నా ఆదినిష్ఠూరము మేలన్న రీతిలో యిన్ని ముందు జాగ్రత్తలు. ఇన్ని రకముల పరిశీలనలు. ఇవన్నియు పూర్తి అయిన తరువాత లాంఛనముగా పెండ్లి చూపుల తతంగము నిర్వహించెదరు. పెండ్లికి



సహజముగా మూడు ముఖ్యభాగములు కలవు. అందు 1. పెండ్లిచూపులు 2. నిశ్చయతాంబూలములు లేక చిన్నలఘ్నములు(ఎంగేజ్‌మెంట్) 3. లఘ్నపు (పెండ్లి) రోజు అని మూడు ముఖ్యభాగములు కలవు.

## పెండ్లిచూపులు :

పెండ్లి కావలసిన యువతీయువకులకు తల్లిదండ్రుల బంధువుల మిత్రుల ఆధ్వర్యములో పెండ్లిచూపులు జరుగుతాయి. వధూవరుల తల్లిదండ్రుల ఆమోదము, ఆహ్వానముపై వధువును చూచుటకై వరుని తరపువారు 5గురు, 7గురు లేక 9మంది (వధువు) కన్యాదాతయింటికి వెళ్లి పెండ్లిచూపులు చూచెదరు. బంధుమిత్రులకు శ్రేయోభిలాషులకు ఇరుపక్షముల వారికి యిదోక కమనీయవేడుక. సిగ్గుల మొగ్గవుతూనే తనకలల రాకుమారుడు ఎలా వున్నాడా? అని ఓరకంట చూస్తుంది వధువు. తన జీవిత కథానాయిక తన కలల పంటేనా? అని బేరీజు వేసికొంటాడు వరుడు. మరోప్రక్క పెద్దల సంప్రదింపులు లాంఛనములు ముచ్చట్లు పూర్తి అవుతాయి. ముహూర్తము, కళ్యాణవేదిక నిర్ణయించుకోవడము తరువాత నిశ్చయ తాంబూలములు యిచ్చి పుచ్చుకోవడముతో అత్యంతకీలకమైన ఘట్టము పరిసమాప్తమౌతుంది. నిశ్చితార్థము జరిగినదంటే సగము పెండ్లి పూర్తిఅయినట్లే.

పెండ్లిచూపుల సమయములోనే వధూవరులు తమతమ వ్యక్తిగత అభిప్రాయములను, మనోభావములను వ్యక్తపరచుకొనెదరు. తల్లిదండ్రులు అట్టి అవకాశము కల్పించెదరు. వధువుకు వరుడు, వరునకు వధువు నచ్చిన యెడల, ఇరువురకు భావసమైక్యత కలిగినయెడల అన్ని విషయములు సుస్పష్టముగా, అరమరికలు లేకుండగా, భవిష్యత్తులో వివాదములకు తావు లేకుండగా మాట్లాడుకొనెదరు. వధూవరుల తల్లిదండ్రుల ఆర్థిక విషయమై ఇరువురకు మంచి అవగాహనతో మాట్లాడుకొనవలెను. "పెండ్లంటే నూరేళ్ళ పంట" అని ఇరువురు గుర్తుంచుకొనవలెను. కేవలము ఆస్థిపాస్తులకే

ప్రాధాన్యమీయరాదు. మంచి సాంప్రదాయము, చదువునకు తోడ సంస్కారము, వినయమునకు తోడు వివేకము సంతృప్తి వుండవలెను.

అన్ని విషయములు క్షుణ్ణముగా, నిర్దుష్టముగా మాట్లాడుకొనవలెను. ఇరువురకు సమ్మతమైన యెడల అప్పుడే సిద్ధము చేసికొన్నట్లయితే వధువుకు పసుపుకుంకుమలు, చీరజాకెట్టు, పూలుపండ్లు, తీపి పదార్థములు (స్వీట్లు) పెట్టిన మీ అమ్మాయిని మా అబ్బాయికి పెండ్లి చేసికొంటాము అని అర్థము. వధూవరుల తల్లిదండ్రులు తాంబూలములు యిచ్చి పుచ్చుకొనెదరు. తదుపరి లఘ్నునిశ్చయపు తేది, సమయము, స్థలము నిర్ణయించుకొనెదరు. లఘ్ను నిశ్చయము కన్యాదాతగారి ఇంటనే జరుగుట ఆచారముగా వచ్చుచున్నది. వధూవరుల అభిప్రాయములు వ్యక్తముకానప్పుడు ఆలోచించి చెబుతా–మనెదరు.

## తాంబూలములు పుచ్చుకొనుట లేక చినలఘ్నుములు :

మనిషి జీవితానికి సార్థకత, సంతృప్తి పరిపూర్ణత లభించడానికి పెండ్లి తప్ప మరోమార్గము లేదు. ఎవరూ కాదనలేని సత్యమిది. అందులకే మన పూర్వులు సంస్కారాలన్నిటిలో వివాహమునకు అత్యంత ప్రాధాన్యమిచ్చారు. హైందవధర్మం ప్రకారముగా వివాహం ధార్మికమేగాదు, ఆధ్యాత్మికం కూడా. సంతానాభివృద్ధే కీలకము, మనిషి వివాహం ఎందుకు చేసికోవాలో దాని వల్ల అతనికి ఒనగూడే ప్రయోజనాలేమిటో మన శాస్త్రాలు ఎప్పుడో చెప్పాయి. వ్యక్తి గృహస్థాశ్రమములో ప్రవేశించి యజ్ఞాలు చేస్తూ పుత్రులను పొందాలి అని ఋగ్వేదములో వివాహసూక్తం చెపుతున్నది. నేను ఆకాశాన్ని నువ్వు భూమివి అందుకే మనమిద్దరము వివాహము చేసికొని తరిద్దాము. పుత్రులను పొందుదాము. ప్రేమానురాగములతో వందేళ్లు పైగా బ్రతుకుదాము అని పురుషుడు స్త్రీని ఆహ్వానించాలని గృహ్యసూత్రాలు సూచించాయి. వంశము నిలవాలన్నా, స్వర్గం లభించాలన్నా స్త్రీ తోడుగా వుండే వివాహం వల్లే



సాధ్యమని యాజ్ఞవల్క్య స్మృతి పేర్కొన్నది. వివాహం చేసికొని భార్యబిడ్డలతో కలిసి ఎవరైతే ధార్మికకర్మలను చేస్తాడో వారే పరిపూర్ణమైన మనిషి అని మనుధర్మశాస్త్రము సూచించినది.

**గృహస్థ జీవితానికి తొలిమెట్టు:–** వివాహము గృహస్థ జీవితానికి తొలిమెట్టు. గృహస్థుగా మగవాడు నిర్వహించే కర్మలన్నింటికి భార్య తోడు అవసరము అని వేదాలెప్పుడో ఘంటాపదంగా చెప్పాయి. అంచేత నాటి పరిస్థితులకు అనుగుణముగా మంచి పౌరులుగా, ధర్మ పరాయణులుగా మెలిగేందుకు అవసరమైన గుణగణాలన్ని యువతీయువకులను గుర్తించి వివాహం చేసేవారు మనపెద్దలు. మరి వధూవరులకు వుండవలసిన గుణగణాలేమిటి? అనే ప్రశ్న తలెత్తినపుడు శాస్త్రకారులు యిలా సూచించారు. వీటిలో కొన్ని తప్ప చాలాభాగము యిప్పుడు అనుసరణీయమైనవే అని ఒప్పుకోక తప్పదు.

## వరుని లక్షణములు :

వంశాభివృద్ధే ప్రధాన లక్ష్యంగా కొనసాగిన ఆ రోజులలో వరుడు మంచి బుద్ధిమంతుడై వుండవలయునని అశ్వలాయనుడు సూచించాడు. మంచి నడవడి, విద్య, ఆరోగ్యము కలవాడై ఉండవలెనని ఆపస్తంబుడు చెప్పాడు. గృహ్య సూత్రములలో బోధాయనుడు బ్రహ్మచర్యమును (గురుకులంలో బ్రహ్మచారిగా క్రమశిక్షణతో విద్యాభ్యాసము కొనసాగించడము) చక్కగా పాటించిన వ్యక్తికే కన్య నివ్వాలన్నాడు. స్మృతి చంద్రిక విషయానికొస్తే కులం, శీలం, శరీరం, యశస్సు, విద్య, ధనం, బంధువుల సహాయసహకారాలు అనే ఏడు గుణాలు కనుక వరుడిలో వుంటే నిరంభ్యంతరంగా కన్యనివ్వ వచ్చునని ఢంకా బజాయించి మరీ చెప్పినది. గౌతముడి ఆలోచన ప్రకారము విద్య, మంచి నడవడి, శీలం, బంధుత్వం కలవాడే ఉత్తమ వరుడౌతాడు. వీటన్నింటితోపాటు వివాహ లక్ష్యమైన సంతానము పొందుటకు తగినట్లుగా వరుడు వీర్యవంతుడై వుండవలెను. మూర్ఛ, పక్షవాతము, సగోత్రుడు,

కుష్టురోగి, పతితుడు, మోసకారి మొదలగు గుణములుగల వారికి పిల్లనివ్వ వద్దని స్మృతులన్నీ చెపుతున్నాయి.

**వధువు లక్షణములు :**

మంచినడవడి, అందం, ఆరోగ్యముతోపాటు సోదరులు వున్న కన్య వివాహమునకు శుభలక్షణములు కలదని నిర్వచించారు. సోదరులు లేకున్న ఆ రోజులలో కన్యలకు వివాహములు జరిగేవి కావట. ఆడపడుచుకు పుట్టింటి దన్ను వుండాలనేదే దీని ఆంతర్యము. అందుకే ఆనాటి కాలములో మగపిల్లలు లేని దంపతులు తొలుత ఏ కుర్రవానినైనా దత్తత తీసికొని ఆ తరువాతే తమ కుమార్తెకు పెండ్లి జరిపించెడివారు.

**శుభంకోరే సుముహూర్తం ముచ్చట్లు యివి :**

మా అమ్మాయికి పెండ్లి నిశ్చయమైనది అని ఎవరైనా చెప్పడముతోనే ముహూర్తం ఎప్పుడంటూ ప్రశ్నిస్తాము. ఎందుకంటే సంప్రదాయ వివాహమునకు సుముహూర్తాన్ని నిర్ణయించుకోవడము అనాదిగా వస్తున్న ఆచారము కనుక. వివాహపద్ధతులు ఎన్నివున్నా బ్రహ్మ, అసుర వివాహములకే ఆ రోజులలో చాలామంది ప్రాధాన్యం యిస్తున్నారు. ఆపస్తంబుడు చెప్పిన దానినిబట్టి శుభకార్యమునకు సుముహూర్తము అనేది అత్యవసరము. అది లేకుంటే వివాహము ఫలప్రదం కాదని చాలామంది నమ్మకము.

**సుముహూర్తమంటే :**

బ్రహ్మవివాహ పద్ధతిలో వరుడు కన్యాదాన సమయములో ప్రమాణం చేస్తాడు. అదేమంటే ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి అని ధర్మార్థ కామాల విషయములో వధువును అతిక్రమించననేది దాని సారాంశము. వరుడు ప్రమాణంచేసే ఆ క్షణాన్నే సుముహూర్తంగా అభివర్ణిస్తారు. కాల ప్రమాణ ఆధారంగా దీనిని నిర్ణయిస్తారు. నిర్ణయించేదెలా అనగా? పుట్టిన వేళను దృష్టిలో పెట్టుకొని అనగా సంవత్సరము, మాసము, వారము, తిథి,



నక్షత్రము, ఘడియ, విఘడియలను అన్నీ గుణించి ఒక్కో వ్యక్తికి జాతక చక్రాన్ని తయారుచేస్తారు. జ్యోతిష్య పండితులు. ఈ సందర్భముగా కాల ప్రమాణాన్ని కచ్చితంగా గుణించినపుడే ఆ వ్యక్తి భవిష్యత్తును చెప్పడము సాధ్యపడుతుందని వారంటారు. వివాహ సముహూర్తం నిర్ణయంలోను ఇలాగే కాలప్రమాణానికి వధూవరుల జాతకాలకు ప్రాధాన్యమిచ్చెదరు.

**శతపథ బ్రాహ్మణము చెప్పినది :**

శతపథ బ్రాహ్మణములోనూ కాలచక్రమును గురించి, కాలప్రమాణాన్ని గురించి వివరముగా చెప్పారు. దానినే హిందూ వివాహ పద్ధతిలో నేటికిని కొందరు పాటించుచున్నారు. కాలప్రమాణం ఆధారంగా సుముహూర్తం నిర్ణయించే పద్ధతి యీ విధముగా వుంటుంది. 24 గంటలకాలమును ఒక రోజుగా పరిగణించితే రోజుకు 50625 భాగములున్నాయి. వాటిని యిలా లెక్కిస్తారు. 15 ప్రాణులు ఒక ఇదాని 15 ఇదానులు ఒక క్షిప్ర 15 క్షిప్రలు ఒక ముహూర్తం 15 ముహూర్తాలు ఒకరోజు ఇలా విభజించాక వధూవరుల జన్మనక్షత్రాలను, జాతకచక్రాలను పరిగణనలోనికి తీసికొని శుభముహూర్తం నిర్ణయించెదరు. శాస్త్రము సూచించినమేరకు ఫలానా సమయములో వున్న ముహూర్తానికి వధూవరులకు ముడిపడితే వారి వైవాహికబంధం కలకాలం శుభప్రదంగా వుంటుందనేది చాలామంది విశ్వాసము. ఆ ప్రకారమే పండితులు నిర్ణయం మేరకు ముహూర్తాలు పెట్టుకొని పెండ్లిండ్లు చేసికొంటున్నారు.

**వివాహమునకు మంచివి :**

వివాహమునకు వైశాఖము, జ్యేష్ఠము, మాఘము, ఫాల్గుణమాసాలు మంచివని పండితులంటారు. కార్తీక, మార్గశిర మాసములు మధ్యమ ఫలితాల నిస్తాయని వారు చెపుతారు. అందువలన సాధారణముగా యీ మాసముల లోనే వివాహాలు ఎక్కువగా జరుగుతుంటాయి. ఆషాఢం, పుష్యం, భాద్రపద

మాసాలను శూన్యమాసాలుగా పరిగణిస్తారు. అందుకే ఆ మాసములలో శుభముహూర్తాలు ఎవరూ నిర్ణయించరు. వివాహమునకు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి మంచితిథులు. బుధ, గురు, శుక్రవారములు మంచివి, ఉత్తమము. ఆదివారం మద్యమని చెపుతారు. రోహిణి, మృగశిర, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, పూర్వాషాఢ, ఉత్తతరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు శుభప్రదంగా వుంటాయని పండితుల నమ్మకము. వృషభ, మిధున, కర్కాటక, తుల, కన్య, ధనస్సు, మీనలఘ్నములు మంచివి.

**గ్రహాలు నక్షత్రాల ప్రభావము:–** బ్రహ్మాండములో వుండే గ్రహాలు, నక్షత్రములు ప్రభావము మానవుడిపై వుంటుంది. ఇది సమయాన్ని బట్టి మంచిగానూ, మరోసారి చెడ్డగానూ వుండే అవకాశం వుంటుందంటారు పండితులు. అందుకే సుముహూర్తంలో జరిగే శుభకార్యాల వలన సత్ఫలితాలు వస్తాయని వారంటారు. ఈ విశ్వాసమే వివాహమునకు పునాది.

## <u>పంచకరహితం అంటే :</u>

వివాహానికేకాదు శుభకార్యములకు మంచి ముహూర్తాన్ని చూచుకోవడము పరిపాటి. అయితే పంచక రహితం కాని ముహూర్తాలను దోష ప్రదంగా భావించెదరు. ఒక ముహూర్తం దోషప్రదం అవునో కాదో యిలా నిర్ణయించెదరు. శుభకార్యం చేసే రోజునాటి తిథి, వార, నక్షత్ర, లగ్న సంఖ్యలను కలిపివచ్చిన మొత్తాన్ని 9తో భాగించెదరు. భాగించగా మిగిలిన శేషమును బట్టి ముహూర్త ఫలం వుంటుంది. ఆ మిగిలిన శేషం 1 అయితే మృత్యుపంచకమని, 2 అయితే అగ్నిపంచకమని, 4 అయితే రాజ పంచకమని 6 అయితే చోరపంచకమని, 8 అయితే రోగపంచకమని భావించెదరు. అంటే పైన చెప్పుకొన్న అంకెలు శేషంగా వచ్చిన యెడల ఆ ముహూర్తము పనికిరాదు. అవికాక మిగిలిన 3, 5, 7 సంఖ్యలు శేషంగా వస్తేదాన్ని



"పంచక రహితం" అంటారు. అదే మంచి ముహూర్తమని శుభ కార్యములకు శుభ ప్రదమైనదని పండితులు చెపుతారు. అయితే యీ జాతకాలు నక్షత్రాలు, ముహూర్తాలు. వీటన్నింటి కంటే ముఖ్యమైనది వధూవరుల అనురాగము, ప్రేమ, అనుబంధము అవి పటిష్టమైతే ఇవేవి వున్నాలేకున్నా ఆ వివాహం ఆనందప్రదమే అవుతుంది.

పెండ్లిచూపులరోజున వధూవరుల అభిప్రాయములు తెలియనప్పుడు, అభిప్రాయములు నిర్ణయములు కానప్పుడు పెండ్లిచూపులరోజున వధువుకు పసుపు కుంకుమలు పెట్టినట్లయితే, ఇప్పుడు వధూవరుల తల్లిదండ్రులు మీ అమ్మాయిని మా అబ్బాయికి చేసికొంటామని, మీ అబ్బాయికి మా అమ్మాయిని యిస్తామని ఒకరికొకరు తాంబూలములు పుచ్చుకొనెదరు. లఘ్న నిశ్చయసహజముగా కన్యాదాతగా ఇంటిలోనే జరుగుచుండును. వరుడు తరపువారు వధువునకు పసుపుకుంకుమలు, చీరజాకెట్లు, పూలుపండ్లు తీపి పదార్థములు (స్వీట్లు) కొత్త నగ తీసికొనివచ్చెదరు. బ్రాహ్మణుడు లేక పురోహితుడు (ఆచార్యుడు) వధూవరుల జన్మనక్షత్రములను బట్టిగాని, లేక నామ నక్షత్రములను బట్టిగాని పెద్దల వీలుపట్టి సుముహూర్తము నిర్ణయించి, లఘ్నపత్రికలు వ్రాసి వధువు తల్లిదండ్రులచేత వరుని తల్లిదండ్రులకు, వరుని తల్లిదండ్రులచే వధువు తల్లిదండ్రులకు యిప్పించెదరు.

కొందరు లగ్నములు పెట్టుకొన్న రోజే కుటుంబములోని వారందరకు లేక వధూవరుల తల్లిదండ్రుల వరకు ఇచ్చిపుచ్చుకొను ధోరణిలో భావముతో బట్టలు పెట్టుకొనెదరు. లగ్నము పెట్టుకొన్నరోజే వధూవరులకు బంగారు ఆభరణము లివ్వడము ఆచారమైనది. లఘ్నము పెట్టుకొన్న రోజే వరుని కూడా ఆహ్వానించడము, వధూవరులను కుర్చీలలో కూర్చొనపెట్టి వధూవరుల తల్లిదండ్రులు బంధువులు మిత్రుల శ్రేయోభిలాషులు అక్షతలు వేచి ఆశీర్వ–దించడము ఆచారమగుచున్నది. ఈ వేడుకకూడా పెండ్లిఅంతటి

ఆర్భాటముగాను ఆడంబరముగాను చేయుచున్నారు. తదనంతరము లఘ్నము పెట్టినందులకు పురోహితునకు (పారితోషకము) దక్షిణ తాంబూలములిచ్చి పంపెదరు.

లఘ్ననిశ్చయము తరువాత మంచిరోజు చూచుకొని వధూవరుల తల్లి దండ్రులు బంధువులు కలిసి కన్యాదాతలు వరునికి ఐదుజతల బట్టలు, వరుని తల్లిదండ్రులు వధువుకు ఐదుజతల బట్టలు తీసికొనెదరు. అనుకొన్న విదముగా వధువుకు చేయించదలచిన నగానట్రా చేయించెదరు. అటులనే వరునకు చేయించదలచిన బ్రాస్‌లెట్, చైను, భటువు వగైరా చేయించెదరు. బంధుమిత్రులకు పెట్టవలసిన పెట్టుబడు వస్త్రములు తీసికొనెదరు. అనుకొన్న విధముగా ఆడపడచుల లాంచనములు జరిపెదరు. లాంచనములు అనునవి ప్రేమతో శక్తికొలది మనసుకు తోచినవి యిచ్చునవి కాని నిర్భంధముగా వసూలు మాత్రము కాదని గమనించవలెను.

## శుభలేఖలు – పెండ్లిపిలుపులు :

ఈ వివాహ ప్రక్రియలో శుభలేఖలు, పెండ్లిపిలుపు ప్రాధాన్యము అంతాయింతా కాదు. దూరప్రాంతములలో వుంటే బంధుమిత్రులను మన తరపున పెండ్లికి ఆహ్వానించేవి యీ శుభలేఖలే. అందుకే అవి మన మనసుకు అద్దముపట్టవలెను. ఆప్యాయతానురాగములకు ప్రేమాభిమానములకు ఆలంబన కావలెను. వాటి ఎంపికలోను, అచ్చువేయించడములోనూ అప్రమత్తత ఆవశ్యకము. పొరుగూళ్ళలో వుండే బంధుమిత్రులకు శుభలేఖలు వీలైనంత ముందే పోస్టు చేయడము నుంచి అత్యంత ప్రధానమైన వ్యక్తులకు, స్థానికులకు స్వయముగా వెళ్ళి పసుపు కుంకుమలు పెట్టి ఆహ్వానించడము వరకూ ఇరుపక్షముల వారు ఎంతో జాగ్రత్త పడెదరు.

ఎందుకంటె శుభలేఖలు, పెండ్లిపిలుపు విషయములో చాలామందికి రకరకముల పట్టింపులు వుంటాయి. వాటిలో ఏ మాత్రము దోషము జరిగినను వివాహమునకు హాజరుకారు. లక్షలు ఖర్చుపెట్టి ఎంత ఘనముగా,



వైభవముగా జరిపినను అతిథులు ఆశీర్వదించెడివారు రానప్పుడు అది అడవి కాచిన వెన్నెల చందమేగదా ! అందులకే వివాహ ప్రక్రియలో శుభలేఖల ఘట్టము అతిముఖ్యమైనదిగా పలువురు భావించెదరు. దీనిని దృష్టిలో పెట్టుకొనే కొందరు కేవలము శుభలేఖలకే లక్షలలో ఖర్చుపెట్టు చుండిరి కూడా. అవి పెండ్లివారి ఆర్థిక స్థోమతను పరోక్షముగా తెలియజెప్పెడివి యీ శుభలేఖలే అనడములో ఆశ్చర్యము లేదేమో.

## అంగరంగ వైభవముగా పెండ్లి ఏర్పాట్లు :

నిశ్చితార్థము, శుభలేఖలు పనులు పూర్తి అయిన తరువాత ఇరుపక్షముల వారూ ఇళ్ళకు వెల్లవేయడము, తాటాకు పెండ్లిపందిళ్ళు ఏర్పాటు, అలంకరణ లతో తరువాత ఘట్టమునకు తెరతీయుదురు. పెండ్లి బట్టలకొనుగోలు, నగలు సామగ్రి సమకూర్చుకోవడము తదితర అంశములపై దృష్టి సారించెదరు. వియ్యాలవారికి పెట్టే వస్త్రములు, వధూవరులకు తీసుకోవలసిన ఖరీదైన పట్టుచీరలు, సూట్లు, కుటుంబ సభ్యులకు అవసరమైన దుస్తులు, బంధు మిత్రులకు పెట్టే పెట్టుబడుల చీరలు జాకెట్లు, కానుకలు, నగలు కొనుగోళ్ళ జాబితా సిద్ధము చేసికొని మార్కెట్లపై దుకాణములపై దండయాత్రలకు బయలుదేరినట్లు బయలుదేరుదురు. అవన్నియు సమకూర్చు కోవడంతో పెండ్లికి కావలసిన ఏర్పాట్లన్నియు పూర్తి అయినట్లే.

## లగ్నపు (పెండ్లి) రోజు :

**వధువు:–** లక్ష్మీ సరస్వతీ పార్వతీ దేవుల ఏకాత్మతా రూపము వధువు. పచ్చదనముతో లోకమును చైతన్యపరచే ప్రకృతితాలుకు శక్తి స్వరూపము వధువు.

**వరుడు:–** త్రిమూర్తుల దివ్యస్వరూపము వరుడు. విధాత చూపిన విజయోన్ముఖ పదములో విజ్ఞతతో నడచుటకు ఉద్యుక్తుడైన సిద్ధ పురుషుడు వరుడు.

**పెండ్లిపీట:–** పెండ్లిపీట పొడవు అయిదడుగులు, వెడల్పు రెండడుగులు. ఎత్తు ఆరు అంగుళములుండవలెనని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. కాని కొందరు పెండ్లిపీట పొడవు 37 అంగుళములు, వెడల్పు ఐదు అంగుళములు, ఎత్తు ఆరుఅంగుళములుండవలెనని చెప్పిరి. ఇది వధూవరులు కూర్చునటకు చాలనటువంటి పీట. ఏ శాస్త్రప్రకారముగా ఈ పీటనుద్దేశించి చెప్పిరో తెలీదు. యాజ్ఞవల్క్యుడు చెప్పిన కొలతలు గల పీట వధూవరులు కూర్చొనుటకు అనుకూలమైనది. సరిపోవునది కూడ. ఇందువలన యాజ్ఞవల్క్యుడు చెప్పిన కొలతలే సరియైన వనుకొనుచున్నాను. ఈ విషయము విజ్ఞుల నిర్ణయమునకు వదలివేయుట మంచిదనుకొనెదను.

ఇహపరలోకములలో పవిత్రతను కలుగచేయు శరీరమునకు సంస్కారములు చేయవలెను. అట్టి సంస్కారములు చేయునప్పుడు ఈశ్వర ప్రార్థనతో ప్రారంభము చేయుట వేదధర్మములందు నుడివిరి. షోడశసంస్కారములు చెప్పిరి. వధువుకు 18 సంవత్సరములు వరునకు 25 సంవత్సరములు వివాహమునకు యోగ్యమని వేదధర్మములందునుడివిరి. ఏకాలమునందైనను వివాహములు చేయవచ్చుననియు తిథివారనక్షత్ర లఘ్నాదులు మిధ్యాకల్పితములనియు, దీనికి ప్రమాణములు లేవనియు శ్రీమత్ దయానంద సరస్వతీ స్వాములవారు నుడివిరి. కొందరు పగలు మాత్రమే వివాహములు చేయవలయునని తెలిపిరి. పెండ్లిరోజు లేక పెండ్లికి ముందురోజు మగపెండ్లివారు వరుడికి స్నాతకము చేయడము, పెండ్లి కొడుకును చేయడము, అటులనే ఆడపెండ్లివారును ఈ వివాహ ఘట్టములో తిలకమునకు ప్రాధాన్య స్థానమున్నది. దానిని గురించి తెలిసికొందుము.

## నుదిటిన కళ్యాణ తిలకము దిద్దరుగా :

“ఎనలేని నోములు నోచి, నీవీరోజు కెదురు జూచిక లగ్నగడియరాగా తలవంచి బిడియపడకే” అని నిచ్చెలులు ఆటపట్టిస్తుండగా వధువు సిగ్గుల



మొగ్గ అయ్యేరోజు పెండ్లిరోజు. ఆ రోజు పెండ్లికూతురు అలంకరణ మనోహరముగా వుంటుంది. కళ్యాణతిలకము వధువుకేకాదు వరుడుకీ పెట్టెదరు. బుగ్గన కాటుకతో దిష్టిచుక్క నుదుట బాషికము, పసుపు బట్టలలో పచ్చని కళ్యాణమండపములో వధూవరులు భార్యాభర్తలయ్యెదరు.

వివాహ సమయములో వరుడు వధువు నుదుట పాపిటలో సింధూరము లేక కుంకుమ బొట్టు పెట్టినప్పుడే పెండ్లితంతు పూర్తి అవుతుంది. ఈ దాంపత్య సంబంధము శాశ్వతము కావలయునని వధువు యీ కుంకుమను అర్థచంద్రాకారములోనో, సూర్యాకృతిగానో దిద్దుకుంటుంది. ఈ సాంప్రదాయములలో విశ్వాసములేనివారు కుంకుమ సౌందర్య చిహ్నముగా పరిగణించెదరు. తమకు వివాహమైన దనుటకు గుర్తుగా, అదృష్టమునకు ప్రతీకగా హిందూ మహిళలు కుంకుమను నుదిటిన పెట్టుకొనెదరు. పెండ్లి పేరంటములలో, నోములు, వ్రతములలో కుంకుమ ఎంతో ప్రముఖ పాత్ర వహిస్తుంది. పరస్పర సౌభాగ్యమును ఆకాంక్షించుచూ స్త్రీలు ఒకరికొకరు బొట్టు పెట్టుకొనెదరు. సువాసినులు, పురాణకాలము నుండీ వీరమాతలు, వీరపత్నులు, తమపుత్రులను, పతులకు నుదిటిన కుంకుమ బొట్టుపెట్టి, హారతులిచ్చి కదనరంగమునకు సాగనంపెడివారు. విజయముతో వారు తిరిగి వచ్చిన తరువాత నుదిటిన తిలకము దిద్ది, హారతిపట్టి స్వాగతము పలికెడువారు.

హిందూ సమాజములో కుంకుమను గురించి ఎన్నో కథనములు ప్రచారములో నున్నవి. దుష్టశక్తులను పారద్రోలేందుకు స్త్రీలు నుదిటిన కుంకుమ పెట్టుకోవలయుననెడిది ద్రావిడుల నమ్మకము. కుంకుమలో కలిసే ఒకరకమైన చిక్కని జిగట పదార్థమునకు, సిందూర చూర్ణమునకీ చలికాలములో ఉష్ణత్వము యిచ్చే గుణమున్నది. కుంకుమలో కలిసే గంధపు చూర్ణమునకీ వేసవిలో చలువను ప్రసాదించే గుణమున్నది. పండితులు,

సాధువులు సింధూరమును బొట్టుగా పెట్టుకొనెదరు. సింధూర వర్ణము చేతనత్వమునకు,స్థైర్యమునకు ప్రతీక. చింతచెట్టు వ్రేళ్ళు, బెరళ్ళను దంచి పొడిచేసి దానిని నిమ్మరసంలో కలిపి ఎరుపు రంగుకు రాగానే గంధపు ముద్దనూ, కుంకుమ పూల ముద్దనూ కలిపి బొట్టుగా ఉపయెగించేవారు పూర్వులు. వర్తులాకార బిందువు శివశక్తుల కలయికకు ప్రతీక. సిద్ధాంత పరముగా బొట్టుయోగిక చిహ్నము. ఏకాగ్రతకు స్థానమై, ప్రాణాధారకు కేంద్రబిందువైన జ్ఞానచక్షువు మానవ శరీరములో నొసటిపైననే వుంటుంది. అందుకే పవిత్రమైన స్థానమును పదిలపరుచుటకు ఔషధవిలువలు సమృద్ధిగా వున్న కుంకుమను ఆస్థానములో బొట్టుగా పెట్టెడివారు. బొట్టు పెట్టిన స్థానములో చర్మములోపలి భాగములో అనవసర ద్రవములు చేరవు.

## నేపాలులో :

జంతుబలులిచ్చే ఆచారము ఒకప్పుడు వుండెడిది. నవవధువు అత్తవారి ఇంటిలో అడుగుపెట్టిన సమయములో జంతుబలులిచ్చే సాంప్రదాయము వుండెడిది. బలిపశువు చిందించిన నెత్తురు చుక్కను నవవధువు నుదుట తిలకముగా పెట్టి ఆమెను యింటిలోనికి ఆహ్వానించెడివారు. నేపాలులో బ్రాహ్మణేతర తెగలలో యిప్పటికీ యీ ఆచారము కొన్నిచోట్ల వున్నది. రక్తపు బొట్టు స్థానములో ఎర్రని కుంకుమను దిద్దటం ఆచారముగా మారినది.

## అనాదిగా :

స్త్రీ సౌందర్యమును యినుమడింపచేసే సాధనములు మనదేశములో అనాదిగా వున్నాయి. మహాభారతంలోని విరాటపర్వములో కీచకుని అక్కగారైన సుదేష్ణకు కురులు దువ్వి కొప్పులేసే పనికి మారువేషములో సైరంధ్రిగా ద్రౌపది సిద్ధపడినది. మధ్యయుగములోని మహిళ అలంకరణలో ప్రావీణ్యురాలని మహాకవి కాళిదాసు వ్రాసినాడు. ఆనాటి స్త్రీలు కూడా యిప్పటి తరమువారికి మల్లినే ముఖాలంకరణ కోసము ఎంతో సమయమును,



ధనమును వెచ్చించెడివారు. రకరకముల ఆభరణములను పొందికగా అలంకరించుకోవడం, వివిధ రంగుల బొట్టు చుక్కలతో కనుబొమ్మలను, వాటి మీదుగా ఒంపు తిరిగి, బుగ్గలను తాకేవిధముగా చుక్కలతో అలంకరించు కొనెడివారు. కుంకుమపువ్వు, చందనముల మిశ్రమముతో తయారైన కుంకుమను "విశేషక" అనెదరు. అలక్తక్ అనే పదార్థమును లిప్‌స్టిక్ వలె పెదవులకు వేసుకొనెడివారు. ఈనాడు కుంకుమ ప్రధాన అలంకరణ వస్తువు. అధునాతన యువతులు తమ దుస్తులకు సరిపోయే రంగులలో బొట్టు పెట్టుకొనెదరు. వివిధ రంగులలో రెడీమేడ్ బిందీలు లభించుచున్నప్పటికీ, సాంప్రదాయ మహిళలు కుంకుమబొట్టునే పెట్టుకొనెదరు.

## పెండ్లిపందిటిలో పచ్చదనము మామిడాకు తోరణము :

పెండ్లివంటి అనేకానేక శుభకార్యములలో మామిడాకులకు ఎంతో ప్రాధాన్యమిచ్చెదరు. అసలు మామిడాకు తోరణము లేకుండగా పండుగకాని, పబ్బముకాని తెలుగువారు జరుపుకోరంటే అతిశయోక్తి కాదు. మామిడాకు శుభానికి సంకేతము. అందులకే హిందూవుల కుటుంబములలో యించుమించు ప్రతిశుభకార్యమునకు యింటి ప్రధాన ద్వారబంధమునకు మామిడాకు తోరణము తప్పనిసరిగా కట్టెదరు. వివాహమునకు సంబంధించిన పెండ్లిపందిరిలో మామిడాకు తోరణము కట్టడము అనెడిది మంగళ వాయిద్యముల నడుమే చేయవలయునన్న ఆచారము చాలా మంది యిప్పటికినీ ఆచరించెదరు. అంతేకాదు పెండ్లి తోరణము కట్టుటకు రమ్మనమని వూళ్ళో పెద్దలను, బంధుమిత్రులను ప్రత్యేకముగా ఆహ్వానించెదరు. ఆ పిలుపులో ఏదో పనికి రమ్మనమని కూలీలను పిలిచినట్లుగా కాక మీ చల్లని చేతులతో పెండ్లి పందిరిలో తోరణములు కట్టండి. వధూవరుల నూరేళ్ళ పంట అయిన వైవాహిక జీవితమునకు చక్కని

పునాది వేయండి అని అర్థించటమే కనపడుతుంది. ఊరి పెద్దలను, ఆత్మీయులను, బంధుమిత్రులను దీనికి రమ్మనమని ఆహ్వానించెదరు. వారందరూ వచ్చిన తరువాత మంగళ వాయిద్యముల నడుమ అంతా కలసి మంగళ తోరణములు కట్టే పని పూర్తి చేయుదురు. తదుపరి అల్పాహార విందు. సమాజములో ఎంతో ప్రేమాభిమానములతో, సరస సల్లాపములతో, ఆనందకోలాహలముతో గ్రామములోని వారందరూ ఒకరికొకరు సహకరించుకోవడము యీ సాంప్రదాయము ద్వారా మనకు అర్థమగుతున్నది. ప్రతి ఆచారమునకు సామాజిక ప్రయోజనమును ముడిపెట్టి మనపెద్దలు బోధించారనెడిది తేటతెల్లమగుచున్నది.

## మామిడాకు తోరణమే ఎందుకు కట్టవలెను? :

మామిడిచెట్టు మహేశ్వరుడు భార్య పార్వతీదేవికి ప్రతిరూపముగా భావించెదరు. పార్వతీ పరమేశ్వరుల కళ్యాణము మామిడిచెట్టు క్రిందనే జరిగినదని, అందులకే వివాహ వేడుకలలో దాని ఆకులకు అంత ప్రాధాన్యము లభించినదని మరికొందరు నమ్మెదరు. మామిడిపూతను కూడా పవిత్రతకు గుర్తుగా భావించేవారు లేకపోలేదు. కొందరు దానిని బ్రహ్మకు ప్రతిరూపమని చెప్పెదరు. వివాహములో లేత మామిడికొమ్మలకు, రెమ్మలకు కూడా విపరీతమైన ప్రాధాన్యమున్నది. పెండ్లిలోనే కాదు మామూలుగా యిళ్ళలో చేసుకునే వ్రతములు, పూజలలో మామిడాకులను నీళ్ళలో వుంచి అభిషిక్త కార్యకలాపములకు వినియోగించెదరు.

## దేవతల ఆశీస్సులు :

మామిడిచెట్టు అంటే దేవతలకు యిష్టమని పురాణములు చెప్పుచున్నవి. అందులకే ఎదురువాసమునకు మామిడికొమ్మను కట్టి దానిని వివాహ మండపములో పెట్టే ఆచారముకూడా కొన్నిచోట్ల వున్నది. ఇలా చేయటం వలన అక్కడకి దేవతలు తప్పనిసరిగా వచ్చి వధూవరులను ఆశీర్వదించెదరని



నమ్మకము. అటులనే సంతానాభివృద్ధికి మామిడిని చిహ్నముగా భావించెదరు. మామిడికొమ్మను పెండ్లిపందిటిలో వుంచటం ద్వారా క్రొత్త దంపతలకు, చక్కని సంతానము కలిగి వంశాభివృద్ధి జరుగుతుందని మరో నమ్మకము. మామిడాకును సన్నగా మడచి, దానికి దారమును ముడివేసి పురోహితుడు (ఆచార్యుడు) వధూవరుల ముంజేతికి కడతాడు. దీనినే "తోరణము" అని వ్యవహరించెదరు. దీనినే "దీక్షాకంకణము" అని కూడా పిలిచెదరు. దీనిని మనవారు చాలా పవిత్రమైనదిగా భావించెదరు. వివాహములలోనే కాదు పూజలు, వ్రతములు, నోములలో కూడా దీనిని ధరించెదరు. ఈ కంకణమును ధరించటము అంటే ఆ చేపట్టిన కార్యక్రమమును పూర్తయ్యే దాకా దీక్షగా వుంటామని చెపుతున్నట్లు భావించవలెను. దీనివలన రక్షణ లభిస్తున్నదనేది మరోవిశ్వాసము.

## ఆయుర్వేద ధర్మములు :

మామిడాకులను తోరణములుగా కట్టడము వెనుక ఆయుర్వేద ఆరోగ్య సూత్రములు కూడా వున్నాయి. దానినుండి వచ్చెడిగాలి దేహమునకు ఎన్నో రకములుగా వుపయోగపడుతుందని శాస్త్రము చెపుతున్నది. పెండ్లి వంటి శుభకార్యములకు వందలాదిమంది అతిథులు, బంధుమిత్రులు ఒకచోట హాలులో హాజరగుదురు. అది వీధిలో పందిరి కావచ్చును, ఫంక్షనుహాలూ కావచ్చును. వందలాదిమంది ఒకచోట గుమికూడినచోట వాళ్ళు బొగ్గుపులుసు (కార్బన్ డై ఆక్సైడ్) వాయువు పెద్దమొత్తములో వుంటుంది. పచ్చని మామిడాకులు ఆ వాయువును పీల్చుకుని స్వచ్ఛమైన ప్రాణ వాయువును అందిస్తాయనెడిది వాటిలో ప్రధానమైనది. ఇంకను చెప్పవలయు నంటే అలిసిసొలసిన కంటికి హాయినిచ్చేది పచ్చదనము. ఆ పచ్చదనమును అన్ని ఆకులూ ఇస్తాయి. మామిడాకులయితే సన్నగా, పొడవుగా వుండటం వలన తోరణము కట్టుకోవడానికి కూడా అనుకూలంగా సులభంగా

వుంటాయని, అందంగా వుంటాయని భావించే పూర్వీకులు వీటికి యింత ప్రాధాన్యమిచ్చారని చెప్పుకొనవచ్చును. వధూవరులు ప్రదక్షిణం చేసే అగ్ని హెూత్రంలో కొన్ని మామిడిపుల్లలను కూడా సమిథలుగా వినియోగించెదరు. ఆయుర్వేద ధర్మములను అనుసరించి ఆరోగ్యమునకు ఇవన్నియును దోహదం చేస్తాయంటున్నారు. అందులకే హిందూ శుభకార్యములలో మామిడికి అంత ప్రాధాన్యం లభించుచున్నదని గ్రహింపవచ్చును. పెండ్లి పందిరిలో కొబ్బరి ఆకులు, అరటిస్తంభములు తదితర పచ్చని సరంజామా వుండటం వెనుక కూడా ఎన్నో ఆయుర్వేద ధర్మములు వున్నవని కూడా చెప్పుకోవచ్చును.

ప్రాతఃకాలముననే మంగళవాయిద్యములతో లేత మామిడి ఆకులతో, రెమ్మలతో కొమ్మలతో యింటిద్వారములకు, యింటికి పచ్చని తోరణములు కట్టెదరు. దైవారాధన తరువాత గ్రామదేవతలకు వడపప్పు, పానకము నైవేధ్యములుగా పెట్టి కొబ్బరికాయలు కొట్టెదరు. బాలదాసుళ్ళకు తలకలు పోసి బొట్లుపెట్టి అలంకరించి పూజానంతరము సహపంక్తి భోజనము పెట్టెదరు.

**నఖాఖండనము (కాళ్ళగోళ్ళుతీయుట) :**

దేశకాలానుసారముగా కొన్ని సాంప్రదాయములు ఏర్పడుచున్నవి. అన్ని కాలములలో సార్వజనీనములైన సాంప్రదాయములు చాలా తక్కువ. మనుష్యులలో మార్పు, హేతువాద దృక్పథము పెరిగిన కొలది కొన్ని ఆచారములు మూఢాచారముల క్రిందకు వచ్చును. అట్టి వాటిలో కాళ్ళ గోళ్ళు తీయుట ఒకటి. ఈ ఆచారము కేవలము కమ్మ, కాపు, రెడ్డి, వెలమ, బలిజ, తెలగ మొదలగు కులములందే పూర్వము వున్నదని తెలియుచున్నది. వివాహమునకు ముందుగా ఈ తంతు జరిపెదరు. ఈ పద్ధతి అష్టవిధ వివాహములందుగాని, వేదములందుగాని, స్మృతులయందుగాని మరి యే శాస్త్రములందుగాని ఈ ఆచారము లేదు. ఇందువలన దీనిని మూఢాచారము



అని పెద్దలందురు. చాలావరకు ఈ ఆచారము తగ్గిపోయినది. ఇట్టిదే తోడు పెండ్లికొడుకు తంతు కూడా. ఈ ఆచారము కూడా దురాచారముగా భావించటము వలన ఈ ఆచారము పూర్తిగా తగ్గిపోయినది. ఒకవేళ కొన్నిచోట్ల తోడుపెండ్లికొడుకును పెట్టవలసివస్తే పది సంవత్సరముల లోపు వానినే పెట్టుచుండిరి. సుముహూర్తమునకు కావలసినంత సమయమునకు ముందే వరుడు తరలివెళ్లవలెను.

**వరుడు తరలివెళ్ళడము :**

ఆంధ్ర దేశమంతటను వరుడు తరలివెళ్ళడము సాధారణముగా జరుగుతున్న ఆచారము. (కొన్ని కులములయందు వధువు తరలివెళ్ళటము కూడా వున్నదని చెప్పుకొనెదరు.) పెండ్లికుమారుడు వధువు తల్లిదండ్రులు నిశ్చయించు గ్రామమునకు లేక కళ్యాణమండపమునకు, వేదికకు తరలి వెళ్ళటము ఒక సంతోషకరమైన వివాహ వేడుక. కంసాలి యింటినుండి పెద్దల యింటినుండి బాషికములు, తాళిబొట్టు, నల్లపూసలు, పెండ్లిపీట కుమ్మరి యింటి నుండి అరివేణి (గరికబుడ్డి) కొత్తమూకుడు తీసుకుని వచ్చెదరు. పెండ్లికుమారునకు ముత్తయిదువలు చేతులకు, గోళ్ళకు గోరింటాకు పెట్టి, కాళ్ళకు పారాణి రాసి, బాషికము కట్టగా బాషికముతో బుగ్గన పెండ్లి చుక్కతో బాజాబజంత్రీలతో బంధుమిత్ర సపరివార సమేతుడై ప్రదానమును తీసుకుని బయలుదేరి, ఆడపడుచుల హారతుల నందుకొని, కానుకలిచ్చి, ప్రత్యక్ష దైవములైన తల్లిదండ్రుల పాదపద్మములకు, పెద్దలకు నమస్కరించి వారి ఆశీర్వాదము తీసికొని, సమీప దేవాలయమునకు వెళ్ళి దైవ దర్శనము చేసికొని ఊరేగింపుగా వరుడు తరలి వెళతాడు. వివాహ సమయమునకు తగినంత సమయముముందే కళ్యాణవేదికకు చేరుకొని సుముహూర్తమునకు జరుగవలసిన క్రియ జరుగును. లేకున్న దేనిదారి అదే అగుతుంది. చాలా మంది ఆలస్యం చేసి పెట్టిన ముహూర్తమును దాటవేసుకొని బాధపడెదరు. కనుక ముహూర్త సమయమునకు తగినంత ముందుగా రావటమే మంచిది.

## వధూవరుల అరచేతులకు, గోళ్ళకు గోరింటాకు :

వధువు నుదుటికి కుంకుమ ఎరుపు, మధురాధరములకు తాంబూల మెరుపు, లిల్లీల తలపించు వేళ్ళకు కాళ్ళకు లేత గోరింటాకు ఎరుపే ఎరుపు అంటుంది ముత్యాల కోకిల సరోజినీనాయుడు. "గోరింటా పూసింది కొమ్మా లేకుండా మురిపాల అరచేత మొగ్గా తొడిగింది" అన్న కవిగారి వర్ణనలోనూ గోరింట అద్భుతముగా పండినది. కాళిదాసు సయితము తన వివిధ సంస్కృత కావ్యములలో గోరింటాకును వర్ణించినాడు. కాళిదాసు కాలమునుండే అన్ని పర్వదినముల సందర్భములలోనూ మహిళలు ఎంతో యిష్టముగా అలంకరించుకొనెడిదిగా గోరింటాకు పేరు గడించినది.

వివాహ సందర్భములలో గోరింటాకుకు మంచి ప్రాధాన్యమే లభించినది. వధువేకాదు పెండ్లికి వచ్చే స్త్రీలందరూ గోరింటాకు పెట్టుకొనెదరు. వరపూజ, వధుపూజ సందర్భములలోనూ మహిళలు మంగళవాయిద్యముల మధ్య గోరింటాకు పెట్టుకొనటము కొన్ని ప్రాంతములలో ఆనవాయితీ. చతురులు, చలోక్తులు, హాస్యముల, చిరునవ్వులు, పాటలు మొదలైన ఆనందదాయక వాతావరణములో పరస్పరము అభినందించుకొనెదరు.

## గోరింటాకు సౌభాగ్య చిహ్నము :

శుభకార్యముల సమయములలో పండుగ సందర్భములలో అలంకారము కోసము గోరింటాకును వాడటము ప్రపంచవ్యాప్తంగా వున్నదే. గోరింటాకును పెట్టుకుంటే కొన్ని వారముల వరకు చేతులు గోళ్లు ఎర్రగా కళకళలాడు తుంటాయి. గోరింటాకును ఉత్తరాదిలో సౌభాగ్య చిహ్నముగా భావించెదరు. వివాహ సందర్భములలో గోరింటాకు ప్రముఖ పాత్ర వహిస్తున్నది. పెండ్లికి ముందురోజు వధువు చేతులు, కాళ్ళు గోళ్లు గోరింటాకుతో చాలా అందముగా అలంకరించెదరు. ఇది ప్రత్యేకముగా స్త్రీల ఉత్సవములా అనిపిస్తుంది. గోరింటాకును వధువు చేతులకు పెడుతూ సందర్భోచితముగా ఉత్సాహ



పరుచుచూ పాటలుపాడెదరు. కొన్ని ప్రాంతములలో వరుడు కూడా చేతులకు గోళ్ళకు గోరింటాకును పెట్టుకొంటాడు.

గోరింటాకు మిశ్రమమును తయారుచేయుదురు. కొన్ని ప్రాంతాలలో గోరింటాకు ఆకులను చెట్టునుంచి కొయ్యగానే కొద్దిగా నీళ్ళు చిలకరించి నూరెదరు. మరికొన్ని ప్రాంతములలో ఆకులను బాగుగా ఎండపెట్టి పొడిగా తయారుచేయుదురు. ఈ గోరింట చూర్ణము మార్కెట్లలో పుష్కలముగా లభ్యమౌతుంది. గోరింట పొడిని మస్త్రకాళితము చేసి ఒకపాత్రలోకి చెంచాడు లేక స్పూను పంచదార ఒకచెంచాడు నూనె, నిమ్మరసము, నీళ్ళు కలిపి దానిలో గోరింటపొడిని చేర్చవలెను. బాగుగా కలిపిన ఆ గోరింట ముద్దను ఒక గంటసేపు నానబెట్టవలెను. ముద్ద జిగటగా వుండటము తప్పనిసరి. సన్నని పుల్లను ఈ ముద్దలో ముంచి డిజైనులు అరచేతిలో వేసుకొనెదరు.

కొందరు చిటికినవ్రేలితో కూడా గోరింటాకును పెట్టుకొనెదరు. గోరింటాకును మరింత అందముగా, పలుడిజైన్లుగా పెట్టే నిపుణులూ వుండెదరు. పెండ్లిండ్లలో బ్యూటీపార్లర్ నుంచి వీరిని పిలిపించి గోరింటాకును పెట్టించుకొనెదరు. వారివృత్తే అదికావటం వలన వారు అతి తక్కువ సమయంలో అందమైన డిజైన్లతో అరచేతులను అలంకరించెదరు. గోరింటాకును పెట్టుకొన్న తరువాత మూడు నాలుగు గంటలు ఆర నివ్వవలెను. ఎండిన తరువాత చెక్కెర, నిమ్మరసంలో ముంచిన దూదితో డిజైన్‌పై అద్దెదరు. ఆకుపచ్చ గోరింట ముద్ద అరచేతిలో పూర్తిగా ఎండిపోయిన తరువాత దానిని తీసివేయును. అరచేతులను ఆవనూనెతో అద్దెదరు. కొంత సేపటి వరకు నీళ్ళతో కడగకూడదు. దీనివలన చేతిలోని ఎరుపువర్ణము మరింత మెరుస్తుంది. ఎక్కువసేపు వుంచిన చెయ్యి బాగుగా పండుతుందని చాలామంది స్త్రీలు పనులు ముగిసిన తరువాత రాత్రి వేళలలో గోరింటాకును పెట్టుకొనెదరు. ఇటీవల కాలంలో అధునాతన డిజైన్లతో పుస్తకములను రూపొందించి మరీ అమ్ముతుంటారు. గోరింటాకు పేస్టును తయారుచేసి ట్యూబులలో అందముగా ప్యాక్‌చేసి అమ్మి పనిని సులువు చేయుచుంటిరి.

## గోరింటాకుకు రాజస్థాన్‌దే అగ్రస్థానము :

గోరింటాకు వాడటంలో మనదేశములోని అన్ని ప్రాంతములకంటే రాజస్థాన్‌దే అగ్రస్థానము. అక్కడి మహిళలు గోరింటాకు పేరు వింటేనే మురిసిపోయెదరు. వారు "మెహిందీ" గా దీనిని వ్యవహరించెదరు. మెహిందీతో అరచేతులను రాగరంజితము చేసుకోవటము స్త్రీల సాంప్రదాయంగా భావించెదరు. రాజస్థాన్ మహిళలు ప్రతి పండుగకూ, ప్రతి ఉత్సవమునకు వేరువేరు డిజైన్లలో గోరింటాకు పెట్టుకొనెదరు. గాంగౌర్, తేజ్, దీపావళి, హెూళీ పండుగలను ఎంతో వైభవముగా జరుపుకొనెదరు. పండుగకు ముందురోజు ఎన్నో డిజైన్లతో తమ పాదములను అరచేతులను అలంకరించుకొనెదను.

## గోరింటాకులో ఔషధగుణాలున్నాయి :

మనదేశంలోని అన్ని ప్రాంతములలో పిన్నలు, పెద్దలు గోరింటాకును ఎంతో మక్కువతో అరచేతులకు, పాదములకు, గోళ్ళకు పెట్టుకొనెదరు. గోరింటాకు ఔషధగుణములను నిక్షిప్తం చేసుకున్న కారణమున జనాదరణ పొందినదని చెప్పవచ్చును. గోరింట ముద్దను అరికాళ్ళకు చలువదనము కోసము పెట్టుకొనెదరు. గోరింటాకులో రోగనిరోధక గుణములున్నాయి. కనుక గ్రామములలో దీనిని మందుగా కూడా వాడెదరు.

## బాషికములు :

వివాహ వేడుకలలో వధూవరులకు బాషికములు అలంకరించెదరు. దీర్ఘచతురస్రము లేదా త్రికోణాకారముగా వుండే వీటిని నుదుటిపైకి వచ్చే విధముగా కట్టెదరు. బియ్యము, ముత్యములతో తయారగు వీటిని నుదుటిపై అలంకరించటం వలన వధూవరులకు మానసిక ప్రశాంతత చేకూరుతుంద నెడిది మన పెద్దల నమ్మకము. మనిషి మనసుకు అధిపతి చంద్రుడు. ఆయనకు సంకేతము బియ్యము. అందుచేతనే బాషికముల తయారీలో



బియ్యమును వుపయోగించెదరని మనము గుర్తింపవలెను. ఒకప్పటి వివాహములు యిప్పటిలా కొన్ని గంటలలో ముగిసేవి కావు. మూడు రోజులనీ, ఐదు రోజులనీ రోజుల తరబడి జరిగేవి. ఆ పెండ్లి తంతు సాగినంతకాలము వధూవరులు నిత్యమూ ఆ వ్రతమని, యీ పూజయని చేయుచుండెడివారు.

మరొకప్రక్క హెూమములు నిర్వహించెదరు. వీటికి తోడు ఉపవాసములు, మరి ఇంకెన్నో ఆచారములు. వీటన్నింటి కారణముగా వారెంతో మానసిక ఒత్తిడికి లోనయ్యెదరు. శారీరకముగా బలహీనపడెదరు. తీవ్ర మానసిక ఆందోళనకు గురి అగుదురు. ఈ పరిస్థితుల నుండి బాషికములు వారిని గట్టెక్కిస్తాయని పెద్దల విశ్వాసము. ఇవి అలంకారముగా బాసిల్లటం వల్ల కూడా చాలామంది ఈ ఆచారమును నేటికీ కొనసాగించుచుండిరి. సామాన్యులు బియ్యముతో తయారైన బాషికములు వుపయోగించితే సంపన్నులు ముత్యాలతో తయారైనవి వాడెదరు. బంగారముతో తయారైన బాషికములను పాలతో శుద్ధి చేసి వాడుకునే ఆచారము అక్కడక్కడా లేకపోలేదు.

## దృష్టిదోష నివారణకు :

కలిలో కన్ను దృష్టికి నరదృష్టికి మించిన దిష్టి లేదు. నరుడు దృష్టి సోకితే నల్లరాయైనా పగులుతుందని సామెత. దీనిని చాలామంది నమ్మెదరు. దీని ప్రభావమునుండి వధూవరులను బాషికములు సంరక్షిస్తాయని మరో విశ్వాసము. యోగుల లెక్కప్రకారముగా మన దేహములో 72వేల నాడులు వున్నాయట. వాటిలో 1.పింగళ 2. ఇడ 3. సుషుమ్న 4. సరస్వతి 5. పూష 6. వరుణ 7. సప్తజిహ్వ 8. యశస్విని 9. అలంబుస 10. కుహు 11. విశ్వోధార 12. పైయస్విని 13. గాంధార 14. శుంబి అనే పద్నాలుగు నాడులు ప్రసిద్ధమైనవి. ఈ పద్నాల్గింటిలో 1. ఇడ 2. పింగళ 3. సుషుమ్న

అనే మూడు నాడులు అతి ప్రధానమైనవి. త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులే వీటికి అధిదేవతలని చెప్పెదరు. సుషుమ్న నాడికి కుడిప్రక్క వుండేది సూర్యనాడికాగా, ఎడమపక్క చంద్రనాడి.

ఈ నాడులు కలిసేచోటును భ్రూమధ్యము అనెదరు. అనగా రెండు కనుబొమ్మల నడుమ ప్రదేశము. ఈ నాడులు ఇక్కడ కలిసి అంతర్ముఖముగా ప్రయాణిస్తాయి. నొసటిపై అర్థచంద్రాకారములో నిలుస్తాయి. భ్రూమధ్యమును మహర్షులు "దివ్యచక్షువు" అనిరి. ఆజ్ఞ చక్రస్థానమనీ యోగవిద్యా పారంగతులు వ్యవహరించెదరు. ఇది రెండు అర్థభాగములుగా సూర్య చంద్ర కళలకు ప్రతీకగా వుంటుంది. ఇటువంటి అతిసున్నిత భాగముపై ఆహుతుల దృష్టిదోషము సోకకుండగా వుండేందుకే బాషికములు కట్టవలయునని కూడా కొందరు చెప్పెదరు. ఎందుకంటే పెండ్లి అనగానే వందలాది మంది ఆహ్వానితులు, అతిథులు వచ్చెదరు కదా. వారిలో రకరకముల వ్యక్తులు వుండెదరు. వారి దృష్టి వధూవరుల మీద పడితే దోషము కనుక ఈ ఆచారము ఏర్పాటు చేసిరని విశ్లేషించుకోవచ్చును. వీరిరువురు వధూవరులని గుర్తుగా వుండుటకు కూడా ఇవి ముఖ్యమని భావించెదరు.

## విడిదిగృహము :

వధువు తల్లిదండ్రులు, బంధువులు తరలివచ్చు పెండ్లి కుమారునికి ఎదురేగి స్వాగతవచనములు పలికి విడిది గృహమునకు లేదా ఏర్పాటు చేయబడిన బసకు వరుని గౌరవ మర్యాదలతో ఆహ్వానించెదరు. దీనినే "ఎదురుకోల" సన్నాహమనెదరు. విడిది గృహమునకు వరుడు రాగానే వరమాలను వేచి, సపర్యలనంతరము వధువు తరపువారు తేబడిన పానకము వరునికి, వరుని తరపువారికి వారి ప్రయాణ బడలికను తీర్చుటకు గ్లాసులలో పోసి అందరకు యిచ్చెదరు. ఈ రోజులలో వధూవరుల విడిది కళ్యాణ మండపము లేక ఫంక్షను హాలులోనే అగుతున్నది. ఇక్కడే వధూవరులకు



వేరువేరు గదులుంటాయి. విడిది ఇంటిలో కూడ వరునిచే పూజ చేయించి కన్యాదాత చేత వరుని కాళ్ళు కడిగించి వరునకు నూతన వస్త్రములు ప్రదానము చేయుట నేను చాలాచోట్ల చూచితిని. విడిది గృహములో ముత్తైదువులకు బొట్టుపెట్టి పండ్లూ తాంబూలముతో సత్కరించెదరు. ఇంటి ఆడపడుచులను ప్రత్యేకముగా గౌరవించెదరు. అందుకే ఆడపడుచు అర్థ మొగుడంటారు. పెండ్లిలో అనేక సందర్భములలో ఆడపడుచులకు పండు తాంబూలములతో పాటు యథాశక్తిగా దక్షణ (లాంఛనాలు) కూడా యిచ్చెడి వారున్నారు. శక్తిలేనివారు కేవలము పండ్లూ తాంబూలములతోనే సరిపుచ్చి సంతృప్తి పరచెడివారున్నారు. ఇవి ఆడతోబుట్టువులకిచ్చే గౌరవ మర్యాదలు.

## వరపూజ :

విడిదిగృహములో వున్న వరుని కళ్యాణవేదికకు ఆహ్వానించి దైవప్రార్థన అనంతరము వధువు తల్లిదండ్రులు పెండ్లికుమారుని కాళ్ళు కడిగి రెండుబొట్లు తలపై చల్లుకొనెదరు. దీనినే "వరపూజ" అందురు. ఇందుకు కారణము బాబూ! అభం శుభం ఎరుగని మాబిడ్డ యీరోజు నుండి నీ సహధర్మచారిణి కాబోతున్నది. ఆమెకు ఎటువంటి కష్టము రానీయకుమని ప్రాథేయపడటమని భావము. ప్రస్తుతము పూర్వాచార ప్రకారముగా వరుని పాదములు కన్యాదాతలు కడుగుట ఆచారముగా వచ్చుచున్నది. కాని కన్యాదాతల కంటె వరుని వయస్సు చిన్నది గదా! చిన్నవాని పాదములు పెద్దలు కడుగుట ధర్మసూత్రములకు విరుద్ధము. ఈ విషయమును విజ్ఞులు, పెద్దలు గ్రహించ గలరు. ఆ నీళ్ళచెంబును వరుడే తీసికొని స్వయముగా పళ్ళెములో ముందుగా కుడిపాదము తదుపరి ఎడమపాదము కాళ్ళుకడుగుకొనవలెను. తరువాత శుద్ధోధకమాచనీయము జరుగును.

## మధుపర్కము :

వివాహప్రక్రియలో మధుపర్కములకు విశిష్ట స్థానమున్నది. "దధి, ఘృత, మధుసంయుక్తమే తన్మధుపర్కమితి" మధుపర్కమనగా పెరుగు, నెయ్యి, తేనె

కలిపిన పదార్థము. ఇది కంచుపాత్రలో లేక వెండిపాత్రలో పోసి స్పూనుతో లేక చెంచాతో కలిపెదరు. కన్యాదాతలు "ఓం మధుపర్కో మధుపర్కో మధుపర్కః" అని పలికి వరునకు ముమ్మారు మధుపర్కము పెట్టెదరు. వరుడు ముమ్మారు మధుపర్కమును "ప్రతి గృహతామ్" అని గ్రహించును. వరుడు మధుపర్కమును గ్రహించుచూ ఓ మధుపర్కమా! నువ్వు వేదములను ప్రకాశింపచేయుదువు. కీర్తిప్రతిష్టల నిచ్చెదవు. నన్ను ప్రజలకు ఇష్టునిగా, పశుసంపద కలవానిగా కూడా చెయ్యి అనడమే యీ మంత్ర సారాంశము.

ఈ విధముగా మూడుసార్లు స్పూనుతో తీసికొని తిన్న తరువాత గిన్నెలో వున్న దంతయును తినవచ్చును. వరుడు మధుపర్కము సేవించిన తరువాత అతనికి నూతన వస్త్రములు బహూకరించెదరు. రానురాను ఈ వస్త్రములనే మధుపర్కములుగా వ్యవహరించడము మనకు ఆనవాయితీగా మారినది. ఎందుకనగా పెరుగు, నెయ్యి, తేనె సాధారణముగా ఎవరింటిలోనైనా వుండెడివే. ఇక ఆ సందర్భముగా వరుడికి పెట్టే వస్త్రములను మాత్రము బయట కొనుగోలు చేయవలసినవే. దీనిని దృష్టిలో పెట్టుకొనే వధువు తరపువారు పెండ్లిబట్టలు కొనేటప్పుడు మధుపర్కములంటే వస్త్రములనే అర్థానికి వచ్చేసిరి.

## వైద్యధర్మములు :

మధుపర్కములలో సామాజికనీతితోపాటు వైద్యధర్మములనేకమున్నవి. మధుపర్క తతంగములో యిచ్చే తేనె వలన మధురముగా మాట్లాడే స్వభావము అలవడి వరుడు మునుముందు అందరకు ఇష్టుడుగా మారతాడన్నది ఒక నమ్మకము. మధురముగా మాట్లాడటము అనగా అందరితో మంచిగా మాట్లాడుచూ వివాదములకు అతీతముగా నూతన గృహస్థుడు వర్థిల్ల వలయునన్న సామాజిక సందేశము యీ ఆచారములో యిమిడియున్నది. ఆయుర్వేదము చెప్పే వైద్య ధర్మముల ప్రకారము తేనెకున్నన్ని సద్గుణములు



మరి దేనికిలేవు. జీర్ణశక్తిని పెంపొందించుటకు, దేహమునకు పుష్టిని కలిగించుటకు ఎంతో దోహదము చేస్తుంది. ఇక నెయ్యి శరీరమునకు శక్తినివ్వగా, పెరుగు చలవ చేస్తుంది. ఈ మూడింటి మిశ్రమమైన మధుపర్కము యివ్వడము ద్వారా వరుడిని శారీరకముగా, ధృడముగా, శక్తివంతుని చేయడము యీ మధుపర్క ప్రక్రియ లక్ష్యముగా స్పష్టమౌతున్నది.

## రక్షాబంధనము :

మానవజీవితమును మధురమైన ముఖ్యమగుక్రియ వివాహకలాపము నందునుడివిరి. ఇదియొక సుదీర్ఘమగు పవిత్ర కార్యక్రమము. మిగుల బాధ్యతా యుతమైన పవిత్రమైన కార్యక్రమములను మేము నిత్యము సత్యమును ఆరాధించుటకు రక్షాబంధనము (దీక్షా కంకణము) ను ధరించి నూరేళ్ళకు పైగా వర్థిల్లుటయే రక్షాబంధనము ముఖ్యోద్దేశ్యము.

పురోహితుడు (ఆచార్యుడు) మంత్రమును పఠించుచూ, వరుని కుడి ముంజేతికి రక్షాబంధనము (దీక్షాకంకణము) కట్టి పెద్దలందరి తరపున ఆశీర్వదించును. పూజ్య మహాశయులారా ! ప్రపంచములో దైవజ్ఞులు నుడివిన ఏ దీక్షాకంకణమును ధరించి, అట్టి రూపమును పొందుచున్నారో, ఆ దీక్షా రూపమును జీవితపర్యంతము పొందుచూ, విద్యాంసులకు, సమస్త మానవులను పూజించి ఆరాధించుటకు, రక్షాబంధనమును ధరించుచున్నాను. నన్ను అటుల ఆశీర్వదించ ప్రార్థించుచున్నాను. అని వరుడు సభికులతో ఆశీర్వాదములు కోరును.

## యజ్ఞోపవీతము :

యజ్ఞోపవీతము (జంధ్యము) వేదధర్మసూత్రముల నుండి మనువు, పారస్కర, ఆశ్వలాయన, బోధాయన, గోభిలాయనలు గృహ్యసూత్రములందు చెప్పిరి. యజ్ఞోపవీతమనగా ఎడమభుజము పైభాగమునుండి కుడిభుజము క్రిందకు వ్రేలాడునది. తొమ్మిదిపోగులు కలది. మంగళ సూత్రమునందు

గ్రుచ్చునది కూడా (నవ) తొమ్మిదిపోగులతో నొప్పుచుండును. ప్రపంచములో సర్వమతములందు వివాహపాణిగ్రహణమును, అటులనే ప్రతిమతమునందు స్త్రీని గృహిణిగా గుర్తించుటకుగాను, ఆయా మతములవారి గుర్తులను స్త్రీలకు మెడయందు కట్టుచున్నారు. వేదధర్మమునందు నవ (తొమ్మిది) సూత్రములతో కూడిన యజ్ఞోపవీతమును వధూవరులకు ధరింపచేసి గృహస్థులు భార్యా భర్తలుగా, దంపతులుగా నూరేళ్లకు పైగా సంపూర్ణ ఆయురారోగ్యములు సుసంతాన సౌభాగ్యములతో వర్థిల్లుటకుగాను, యీ ప్రకృతీశ్వరుని నిత్యము ధ్యానించుటకు యజ్ఞోపవీతము (జంధ్యము) ముఖ్యముగా ఉద్దేశింపబడినది. ఈ యజ్ఞోపవీతము లేనిదే పురుషుడు ఎట్టి శుభకార్యములు చేయుటకు అర్హుడు కాదని భావము.

దంపతులు నిత్యము గృహమందు అగ్నిని వెలిగించి గృహయజ్ఞమునకు దేశ కళ్యాణం కొరకు మహాయజ్ఞమునకు కార్యకర్తలుగా వ్యవహరించుటకు యీ యజ్ఞోపవీతమును ధరింపచేయుచుండిరని గ్రహింపవలయును. కొన్ని వేల సంవత్సరములనుండి వచ్చుచున్న యీ వివాహవ్యవస్థ సుస్థిరమైనది. ఇది మానవులేర్పరుచుకున్న సాంఘికమైన కట్టుబాటు. పెద్దలు, విజ్ఞులు ఏర్పరిచిన వివాహాది షోడశసంస్కారములు మానవుని నాగరికతా చిహ్నములు. ఇదే విధముగా గృహస్థులను నిర్దేశించుటకు సంకేతముగా (గుర్తు) యీ మంగళసూత్రము, యజ్ఞోపవీతములు ఉపకరణ సాధనము లైనవి. ఇందువలన పురుషునకు యజ్ఞోపవీతము శుభాశుభ ప్రతికార్యము నందు తప్పనిసరిగా నుండవలెను.

ముందుగా వరుని దగ్గరకు వరుని తల్లిదండ్రులును రావించి యజ్ఞోపవీతము (జంధ్యము) ను వరుని తల్లిదండ్రులకు యిచ్చి వరునికి పుష్పాక్షతలు యిచ్చి, తల్లిదండ్రులకు నమస్కరింపచేసి, వరునిచేత యజ్ఞోపవీత మంత్రములను అనిపించి తరువాత వరుని తల్లిదండ్రులు వరునికి యజ్ఞోపవీతమువేసి పుష్పాక్షలతో ఆశీర్వదించెదరు.



తరువాత పురోహితుడు యజ్ఞోపవీతమును గూర్చి "ఓం యజ్ఞోపవీతం పరమపవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్, ఆయుష్య మగ్ర్యం ప్రతిముంఛ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః" (ఋగ్వేదం) అని యజ్ఞోపవీత పవిత్రతను, ప్రాముఖ్యమును గూర్చి సభికులందరకీ తెలుపును. తదుపరి పెద్దలందరి తరపున పురోహితుడు వరునికి ఆశీస్సులు అందించును.

**గౌరీదేవి పూజ :**

మంగళ సూత్రమునకు గౌరీదేవి అధిష్టానదేవత. ఇందువలన ప్రతికన్య పెండ్లికి ముందు తప్పనిసరిగా గౌరీదేవి పూజ చేయు ఆచారమేర్పడినది. గౌరీదేవికి మంగళగౌరీదేవి అను పేరు కూడా కలదు. అందుకే ముందుగా కన్యాదాత గృహమందు ఎచ్చట దైవారాధన నిత్యము చేయుచున్నారో అచ్చట కన్యాదాతలు వధువుతో దైవారాధన "గౌరీదేవి పూజ" చేయించెదరు. ముందుగా దీపారాధన కుందులు, తదుపరి అఖండజ్యోతిని వెలిగించి గౌరీదేవి పూజ చేయుదురు. పూజానంతరము పురోహితుడు వధువుతండ్రి కుడిముంజేతికి కంకణధారణ చేయును. వధువు తండ్రి భార్యకు, వధువు కుడిచేతికి కంకణములు కట్టును. తదుపరి ముత్తైదువులు వధువు కాళ్ళకు పారాణిరాసి, చేతులకు గోళ్ళకు గోరింటాకు పెట్టి బాషికము కట్టి బుగ్గన సాధుతో పెండ్లిచుక్క దిద్దెదరు. వధువును కన్యాదాతలను పూజ దగ్గరున్న బంధుమిత్రులు, పెద్దలు, ముత్తైదువలు అందరూ ఆశీర్వదించెదరు. (పెండ్లి కళ్యాణవేదిక మీద జరిగినయెడల ఈ మంగళగౌరీదేవి పూజ కళ్యాణవేదిక మీద జరుగుతుంది.)

**కళ్యాణవేదికవద్దకు :**

వధువు తండ్రి కొత్తచెంబులో నీటితో చెంబు పట్టుకుని, వధువు తల్లి వరునికి కన్యాదాన అప్పగింత సమయములో నూతన వస్త్రములు, వెండి జంధ్యము పళ్ళెరములో పెట్టుకొని వధువుతో సహా, వధువు దోసిలిలో

తాంబూలము, దక్షిణ, కొబ్బరిబోండము పెట్టి కళ్యాణవేదికకు తీసుకుని వచ్చెదరు. కన్యాదాతలు వధువును తూర్పుముఖముగా కళ్యాణవేదికమీద కుడిపాదముందుంచి కూర్చొనెదరు. తెల్లని అడ్డుతెర పెట్టెదరు. దీనికే మరొక పేరు "తెరసాల". తెల్లనివస్త్రముపై శ్రీ, స్వస్తిక్ అని వ్రాసివుంటుంది. కానీ యీ రోజులలో ఏదో ఒక దుప్పటి, లేక లుంగీగుడ్డ తెరగా పట్టుతున్నారు. వధూవరులను తూర్పు, పడమరలకు అభిముఖంగా కూర్చొనబెట్టి, ఈ తెరసాలను ఉత్తరదక్షిణములుగా పట్టుకుని సూర్యసోక్తము ఒకవైపు, మంగళ వాయిద్యముల మధ్య, ముత్తయిదువలు, మంగళగీతములు మరియొకవైపు ఆలపించుచుండగా వధూవరులు జీలకర్ర బెల్లము ఒకరితలపై ఒకరు పెట్టుకుందురు.

వేదధర్మసూత్రములందు తెరపట్టు విషయమును చెప్పలేదు. కనుక తెర పట్టనవసరంలేదని కొందరందురు. ప్రస్తుతము తెల్లని తెరపట్టి కార్యక్రమము చేయించుట ఆచారములో నున్నది. ప్రత్యక్షముగా ప్రతి పెండ్లిలోనూ చూచుచున్నాము.

## ఆదానం భూమండలం దానంచేస్తే వచ్చే ఫలానికి సమానము:

వివాహములో కన్యాదానము ప్రాముఖ్యము అంతాయింతాకాదు. కన్యాదానఫలం అమోఘమని, అపరిమితమని పెద్దలు చెబుతున్నారు. అందుకే పిల్లలు లేని దంపతులు, బంధుమిత్రుల కుమార్తెల వివాహముల సందర్భంగా వారి అనుమతి తీసుకొని ఆ అమ్మాయిలను కన్యాదానం చేయుటకు ముందుకు వస్తారు.

**ఒక్కోయుగానికి ఒక్కోధర్మం:–** పద్మపురాణాన్ని అనుసరించి ఒక్కో యుగంలో ఒక్కో ధర్మానికి ప్రాముఖ్యం లభించినది. కృతయుగంలో తపస్సుకు ప్రముఖ స్థానం దక్కగా త్రేతాయుగంలో జ్ఞానానికి పెద్దపీఠ వేసింది. ద్వాపర యుగంలో యజ్ఞాలకు ప్రాముఖ్యాన్నిచ్చింది. ఇక కలియుగంలో దానానికి విశిష్టస్థానం లభించినది. పురాణాలలో ఎన్నో రకముల దానాలున్నాయి. శిబిచక్రవర్తి



శరీరమునే దానము చేశాడు. దధీచి తన శరీరములో ఎముకలను దానంగా యిచ్చాడు. పరుశురాముడు, బలిచక్రవర్తి, కర్ణుడు, జీమూతవాహనుడు తదితరుల దానగుణ విశేషములు అందరకూ తెలిసినవే. ఇంకా మొత్తం 16 మహాదానాలను అతి గొప్పగా మత్స్యపురాణము పేర్కొన్నది. వీటిలో కన్యాదానము కూడా ఒకటికావటం గమనార్హము.

## కన్యాదానం గొప్పతనము :

కన్యాదానం గొప్పతనానికి వివాహమంత్రాలే సాక్ష్యము. వాటి ప్రకారముగా అనాదిగా జీవుడు విద్యాహీనత పాపకర్మ ప్రభావాలవలన అనేక జన్మలెత్తుతుంటాడు. మానవజన్మ ఎత్తినా అరిషడ్వర్గాలను జయించలేక, అజ్ఞాన మోహాంధకారాలలో చిక్కుకొని ఎన్నెన్నో పాపాలు చేస్తుంటాడు. దైవనింద, భక్తులను అవమానపరుచుట, సజ్జనులను హింసించటం వంటి అపచారాలకు ఒడికడతాడు. ఇటువంటి పాపములనుండి విముక్తుడు కావటానికి అతడికి ఒకటేదారి. అదే కన్యాదానము. కన్యాదానము వలన అతని పాపాలన్నీ పటాపంచలైపోతాయి.

## సత్యలోకనివాసము :

కన్యాదాన గొప్పతనమును గూర్చి ఎంతో చెప్పవచ్చును. వివాహ మంత్రములలోని "గంగావాలుకాభిస్సప్తర్షి మండల పర్యంతము... బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం" లో ఎంతో ఉత్కృష్టభావమున్నది. కన్యాదానముద్వారా లభించే పుణ్యంవలన కోట్ల సంవత్సరములు సత్యలోకంలో నివసించుటకు అర్హత లభిస్తుందట. మరో విషయము ఏమంటే కన్యాదానము వలన మనతోపాటు పదితరాల పూర్వీకులు, మన తరువాత పది తరాలవారూ శాశ్వితంగా సత్యలోకంలో నివసించటానికి అవసరమైన పుణ్యం లభిస్తుందట.

## నూరుయజ్ఞాల ఫలము :

నూరుయజ్ఞాలు చేసిన ఫలమునకు మూడురెట్లు పుణ్యము ఒకేఒక్క

కన్యాదానము వలన లభిస్తుందనీ పెద్దల ఉవాచ. ఇది పెండ్లి మంత్రముల లోనే ఉన్నది. మత్స్యపురాణములో ఇంకొకమాట కూడా చెప్పారు. "సర్వాభరణం సంయుక్తాం యోదదాతిచతేన దత్తాసర్వాసశైల కాననా" అని స్థూలముగా దీని అర్థము ఏమంటే పర్వతములు, వనాలతో కూడిన భూమండలం మొత్తాన్ని దానంచేస్తే వచ్చే పుణ్యఫలము ఆభరణములతో అలంకృతమైన ఒకకన్యను దానంచేయటం వలన లభిస్తుందనీ, పురుషార్థాలు నాలుగు ధర్మ, అర్థం, కామం, మోక్షం అనే ఈ నాలుగు పురుషార్థాలు సిద్ధిస్తేనే మానవజన్మకు సార్థకత. కేవలం కన్యాదానం వలననే చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయని పలువురు నమ్ముతారు. అందుకే కన్యాదాత కన్యాదాన సమయములో ఈ అర్థము వచ్చే మంత్రములను పఠించి మరీ తన కుమార్తెను దానంచేస్తాడు.

## కన్యాదానం ఎలా చేస్తారు :

కన్యాదాత మొదట వరుని పూజించి, కాళ్ళు కడుగుతాడు. తరువాత నగలు ధరించి, కొబ్బరిబొండం, పువ్వులు, అక్షతలు, బంగారం లేదా దక్షిణ పట్టుకొన్న వధువు కుడిచేతిని ఆమె తల్లిదండ్రులు వరుడికుడిచేతిలో వుంచి ఉదకముతో దానంచేస్తారు. సాధారణంగా ఏదైనా వస్తువునో, భూమినో దానం చేసేటప్పుడు ఫలానా దానిని నీకు దానం చేస్తున్నాను. ఇకపై దానిపై సర్వహక్కులునీవి. నాకిక ఎలాంటి సంబంధములేదు. అను అర్థము వచ్చేలా చెబుతాము. కన్యాదాన విషయంలో మాత్రము వధువు తండ్రి చివరలో "నమమ" అని చెప్పడు. ఎందుకంటె వివాహమైనంత మాత్రమున ఆమె అతని కూతురు కాకుండా పోతుంది? అంతటితో ఆమెకు పుట్టింటి బంధము తెగిపోతుందా? పోదుకదా. అందుకే ఆమాట చెప్పకుండా కన్యాదానం చేస్తాడు. అప్పుడే వరుడితో ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి అని మూడుసార్లు అన్పిస్తారు. ధర్మంలోనూ అర్థం అంటే డబ్బు విషయంలోనూ కామం అనగా దైహిక సుఖం విషయంలోనూ నీమాట అతిక్రమించబోను అని వరుడితో ప్రతిన చేయిస్తారన్నమాట.



## ఇద్దరూ పరమేశ్వర స్వరూపులే :

వివాహ మంత్రముల సారాంశము ప్రకారముగా కన్యాదాత అయిన వధువు తండ్రి ప్రతిగ్రహీత అయిన వరుడు ఇద్దరూ పరమేశ్వర స్వరూపులే. అంటే దానమిచ్చేదీ పుచ్చుకొనేదీ కూడా పరమేశ్వరుడే. ఆయనే ఆ ఇద్దరి అంతరంగాలలో ప్రవేశించి వారిచే యీ పని చేయిస్తున్నాడు. దీని వలన వారి ఇద్దరిలో కన్యాదాతకు పుణ్యలోక సుఖాలు వరుడికి ఐహిక సుఖాలతో పాటు అతని జీవితానికి ఒక అర్థం లభిస్తాయి. అంటే చేసేది చేయించేదీ అంతా ఆ పరమాత్ముడే అన్న ఆధ్యాత్మిక భావన ఇందులో యిమిడి వుందన్న మాట. నేనునాది అనే అహంభావము స్వార్థము నశించడానికి అందరిపట్లా ప్రేమాభిమానాలు సహనశీలత వంటి సద్గుణాలు పెంపొందడానికే పెద్దలు ఈ ఏర్పాటు చేశారని మనం సంభావింపవచ్చును.

## కన్యాదాన స్వీకారము :

అన్ని దానములలో గొప్పది అన్నదానము. తరువాత కన్యాదానము. ఈ సృష్టి వ్యాప్తి చెందుటకు స్త్రీ పురుషసంయోగము ప్రధానము. దీనికి వివాహములో కన్యాదాన ఘట్టము ప్రధానముగా నుడివిరి. గృహస్థాశ్రమములో ప్రవేశించి ధర్మార్థకామమోక్షములను వీరిర్వురు భాగస్వాములై వర్థిల్లుటయే కన్యాదాన ముఖ్యోద్దేశము. కన్య + దానము = కన్యాదానము. అనగా కన్యను దానము చేయడమని అర్థము. కానీ యిక్కడ కన్య + ఆదానము అంటె కన్యను స్వీకరించడము గ్రహించడమే అని అర్థము వస్తుంది. దానమంటె ఇవ్వడము, ఆదానమంటే తీసికొనడము. పెండ్లి సందర్భముగా వేదములలో కన్యాప్రతిగ్రహణమనే వున్నది. కానీ కన్యాదానమనిలేదు.

వధువు దోసిటతో తాంబూలము దక్షిణ కొబ్బరిబొండము పెట్టి వధూవరుల మధ్య అరివేణి (గరికబుడ్డి) పెట్టి, ఈ అరివేణి మధ్య దోసిలివుంచి, వరుని దోసిలి మీద వధువు దోసిలి వుంచిన పిమ్మట కన్యాదాతలకు ఆవుపాల

గ్లాసుయిచ్చి, అవుపాలను కన్యాదాతలు తమలపాకుతో కొబ్బరిబోండము మీద పాలుపోయుదురు. కన్యాదాతలు "ఓం సమంజంతు విశ్వదేవాః సమాపో హృదయానినౌసంమాతరి శ్వాసంధాతా సముదేష్ట్రే దధాతునౌ (ఋగ్వేదము) అనగా వధూవరులమైన మేమిరువురము గృహస్థాశ్రమములో ప్రసన్నముగా, సంతోషముగా కలిసిమెలిసి జీవించుటకు ఒకరినొకరము వరించుకొన్నాము. రెండు నదులలోని జలము (నీరు) కలసిపోయిన తరువాత ఏ విధముగా విడదీయలేమో అదే విధముగా మా హృదయములను కూడా విడదీయలేని విధముగా ఒక్కటై ప్రశాంత జీవనమును గడిపేందుకు తోడ్పడవలయును. పరమాత్ముడు విశ్వమును ధరించినట్లు, మేము ఒకరినొకరము ధరించవలెను. ప్రేమానురాగములతో వర్థిల్లవలెను. అంటూ పరమాత్ముని ప్రార్థించడము దీని సారాంశము. ఇదే సమయములో వధువునుద్దేశించి వరుడు ఓవధూ:– నువ్వు పతిని ద్వేషింపకుము. పరమాత్ముని కృపతో నీకళ్ళలో కరుణ రసముండ వలెను. బంధువులకు, నాకు శుభమును, సుఖ సంతోషములను, శాంతి నివ్వవలెనని కోరును.

## కన్యాదాతలు :

ప్రపంచమందున్న సమస్తభూతములు, దేవతల సాక్షిగా మా పితృదేవుల మోక్షసిద్ధి కొరకు యీ వరునకు ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థ సిద్ధి కొరకు మేము ప్రయత్నములతో కూడిన వారమై, అలంకారాన్వితసాధ్వి యగు యీ కన్యను బుద్ధిమంతుడును సుస్వభావుడు నైన యీ వరునకు పెద్దల సమక్షమున ఒప్పగించుచున్నాము. అని పలికెదరు.

వరుడు భగవత్ స్వరూపుడని ముందే చెప్పుకొన్నాము. అందుకే కన్యాదాన సమయములో విష్ణుస్వరూపుడైన నీకు బంగారు ఆభరణముల చేత అలంకరించిన కన్యను (నా కుమార్తెను) పెద్దల సమక్షమున సమర్పించుకొను చున్నాను. అనే భావముతో యీ శ్లోకము చెపుతాడు కాన్యదాత అట్లని కాళ్ళు భార్యభర్త కడిగి గౌరవించడము తెలుగువారి వివాహములోని ప్రత్యేకత. మరోజాతి వివాహములలో యీ ఆచారము కనపడదు. ఈ గొప్పభావమును జీవితాంతము గౌరవించడము మన సాంప్రదాయకము.



పురోహితుడు (ఆచార్యుడు) వధూవరుల పితృపితామహుల గోత్రోచ్చారణము చెప్పును. వధూవరుల దోసిళ్ళ యందున్న కొబ్బరిబోండము ఆవలపెట్టిన తరువాత వరుడు ఆహుతులైన పెద్దలందరను ఆశీర్వదించమని ప్రార్థించును.

## కన్యాదాతల ప్రార్థన :

కన్యాదాతలు "ఓం ధర్మేచార్థేచకామేచ నాతిచరితవ్యాత్వమేయమ్" అని పలికెదరు. వరుడు "ఓం నాతిచరిష్యామి" మీరు కోరిన విధముగా యీమెను అతిక్రమించి నడువను అని పలికును. మళ్ళీ కన్యాదాతలు నా ప్రేమైక నిధానమైన యీకన్య త్రికరణశుద్ధిగా నిన్నువరించి, ధర్మార్థకామమోక్షసాధనకై చేయు ప్రయత్నములో నీకు చేదోడువాదోడుగా తోడునీడగా వుండి జీవయాత్ర గడపవలెనని అభిలషించుచున్నది. కనుక ఆమె అభీష్టము నెరవేర్చుటకు మేము ఉవ్విళ్ళూరుచున్నాము. కాబట్టి ఆమెను పాణిగ్రహణమాచరించి ఋజు మార్గము తప్పక జీవయాత్ర గడపవలెనని మేము కోరుకొనుచున్నాము అనును.

**పురోహితుడు:–** నేడు మీరు బ్రహ్మచర్యము వీడి గృహస్థాశ్రమము స్వీకరించబోవుచున్నారు. ఆశ్రమములలో కెల్ల గృహస్థాశ్రమము చాలా వుత్తమమైనది. మహోన్నతమైనది. కష్టతరమైనది. అని కూడ మీకు తెలియును. అతిథి అభ్యాగతుల పూజలు నిరంతరము విసుగు విరామము లేకుండగా ఆచరించి, గృహధర్మమును చక్కగా నెరవేర్చండి. నీతినియమములు తప్పక మర్యాదలు జవదాటక సుసంతానమును పొంది దేశసౌభాగ్యమునకు జాతిసౌభాగ్యమునకు తోడ్పడుదురుగాక అని అక్షతలతో ఆశీర్వదించును.

## సుముహూర్తము :

కనురెప్పపాటులో కోటివంతు పరిమాణకాలము సుముహూర్తకాలము. ఇందువలన లఘ్నమందు శుభకాలమును విధాత (బ్రహ్మదేవుడు) కూడా ఆ శుభకాలమును శుభకార్యమును తెలిసికొనలేడు. ఇక మానవులకు పూర్వ

జన్మ సంచితార్థానుసారముగా లఘ్నప్రాప్తమగును. జ్యోతిష్కుడు సాక్షి మాత్రుడే గాని లఘ్నప్రదాత కాజాలడు. దీనిని బట్టి నేడు నిర్ణయించుచున్న సుముహూర్త లఘ్నములు కల్పితములని తెలియుచున్నది. కాని విజ్ఞులు, పెద్దలు, దైవజ్ఞులు నిర్ణయించుకాలమే అట్టి సుముహూర్త కాలమని పెద్దలు చెప్పెదరు. అదే శుభప్రదమైన దైవిక సమయము. సుముహూర్తము. వధూవరుల వైవాహిక జీవితము విశ్వమోదముతో అరుదుగా లభించే నవగ్రహముల దివ్యశక్తి ప్రసరణ సమయము. ఈ సుముహూర్తమునే "నిరీక్షణ" అని కూడా పిలిచెదరు. ఆ శుభ సమయములో ఆ సుముహూర్త సమయములో పదుగుర దృష్టి ఆశీస్సులు శుభదాయకములై అమంగళమును, అశుభమును శాంతింప చేయుననుట యధార్థము.

## జీలకఱ్ఱ బెల్లము అంటే చూపులు కలిసే శుభవేళ :

హిందూ వివాహములలో జీలకఱ్ఱ బెల్లము ప్రాధాన్యము అంతాయింతా కాదు. ముహూర్త సమయమునకు ఖచ్చితముగా ఈ కార్యక్రమము నిర్విఘ్నముగా జరిగిపోవలయునని ఇరుపక్షముల పెద్దలు కోరుకొనెదరు. కళ్యాణవేదికపై వధూవరులను తూర్పు, పడమర ముఖములుగా ఒకరిఎదురు ఒకరిని కూర్చుండబెట్టుదురు. వారిమధ్య ఉత్తర దక్షణముఖములుగా తెల్లని తెరను పట్టుకొని ఇద్దరు నిలబడెదరు. ఈ తెరనే "అడ్డుతెర" లేదా తెరసెల్లా లేక తెరసాల అని వ్యవహరించెదరు. దీనిపై స్వస్తిక్ లేదా శ్రీరామ అని అందముగా అక్షరములతో కుట్టెదరు. పురోహితుడు సూర్యసూక్తము పఠించు చుండగా మరియొక ప్రక్క మంగళవాయిద్యములు మ్రోగుతుండగా ముహూర్తము వేళకు వధూవరులు ఒకరితలపై ఒకరు తమ కుడిచేతితో జీలకఱ్ఱ బెల్లపు మిశ్రమము పెట్టెదరు.

జీలకఱ్ఱ బెల్లము పెట్టడమంటే కేవలము వెంట్రుకల మీద అలా ముట్టించి ఊరుకోవటము కాదు. మాడుకు తాకే విధముగా ఆ మిశ్రమమును



పెట్టవలెను. అదే వధూవరుల తొలిస్పర్శ. అనంతరము అడ్డుతెరను తొలగించెదరు. ఆ సమయములో వధూవరులు ఒకరికళ్ళలోకి ఒకరు చూచుకొనెదరు. అదే తొలిచూపు. ఆ విధముగా వారు ఒకరినొకరు స్పృశించటము, ఒకరినొకరు చూచుకోవడమే ముహూర్తమని అనిదెరు. అప్పుడు పురోహితుడు ఆయం ముహూర్త స్సుముహూర్తో... అస్తుఅస్మిన్ శుభదినే ఓం తత్సత్ జీరగుడాన్నిక్షిప్య... అంటూ మంత్రములు చదువుతాడు. అంతేకాదు వధూవరులతో కూడా దీర్ఘాయువు, ఆరోగ్యము, కీర్తి, శక్తి, అభివృద్ధి కావాలి మంచి సంతానము కలగవలయునని దీవించండి పెద్దలారా ! అనే అర్థము వచ్చే మంత్రములు ఆ సమయములో అనిపించుతాడు. అందుకే నన్నమాట జీలకర్ర బెల్లము పెట్టగానే పెండ్లికి వచ్చిన పెద్దలందరూ లేచివెళ్ళి వధూవరులపై సుఖీభవ, తథాస్తు, శుభమస్తు అనుచూ అక్షతలు వేచి దీవించెదరు.

## కళ్యాణవేదికపైనే తొలిచూపు :

పూర్వము పెండ్లికి ముందు వధూవరులు ఒకరికొకరు చూచుకొనే సాంప్రదాయము లేదు. పెద్దలే అన్నీచూచి ఆలోచించి ముహూర్తము నిర్ణయించెదరు. ఆ తరువాత కళ్యాణవేదికపైనే వధూవరులు చూపులు కలపటము పరస్పరము శిరస్సులను తాకటము జరిగెడిది. దీనికి జీలకర్ర బెల్లపు ఘట్టము భూమిక అవుతుంది. అందుకే పెండ్లి వేడుకలో దీనికి ఇంత ప్రాధాన్యము లభించినది. జీలకర్ర బెల్లమును కలిపి నూరినా, నమిలినా, ధనసంజ్ఞకమైన విద్యుత్తు (పాజిటివ్ ఎలక్ట్రిక్ చార్జి) పుడుతుందని విజ్ఞాన శాస్త్రవేత్తలు సూత్రీకరించిరి. దాని ప్రకారముగా ఇది ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమైనది. వధూవరుల పరస్పర జీవశక్తుల ఆకర్షకు ఇది తోడ్పడుతుందని వారి నమ్మకము. పరస్పర స్పర్శకుతోడు అదే సమయములో చూపు కూడా కలవటము, అనంతరము మనస్సులు ఏకముచేసికోవటమునకు చక్కగా

దోహదము చేస్తుందని వారనెదరు. జీలకఱ్ఱ బెల్లము అనెడిది విద్యుత్ పరిభాషలో ధన, ఋణ ధ్రువాలనీ మరికొందరు వ్యాఖ్యానించెదరు. ఈ రెండూ అటునుంచి ఇటు, ఇటునుంచి అటూ కలసినపుడు విద్యుదయస్కాంత శక్తి పుడుతుందని, అదే సమయములో వధూవరులు ఒకరికళ్ళలోకి ఒకరు చూచుకోవటం వలన పరస్పర ఆకర్షణకు లోనవుతారని వారనెదరు. అంతేకాదు దీనవలన ఆ దంపతులు ఒకేవిధమైన జీవనతత్వానికి అనుసంధానమౌతారని కూడా చెప్పుచుండిరి.

## యోగశాస్త్రము ఏమంటుందంటే? :

ప్రతిమనిషికీ తలపై మాడుభాగములో బ్రహ్మరంధ్రము వుంటుంది. నిత్యమూ మూసుకొనివుండే ఈ బ్రహ్మరంధ్రముపై జీలకఱ్ఱ బెల్లపు మిశ్రమము వుంచటం వలన అది తెరుచుకుంటుంది. వధువు తలపై అనగా బ్రహ్మ రంధ్రముపై జీలకఱ్ఱ బెల్లపు మిశ్రమమును వుంచి దానిపై వరుడు తన చేతిని పెడతాడు. ఆచేతిద్వారా అతనిలోని శక్తి మొదట జీలకఱ్ఱ బెల్లము మిశ్రమములోనికి, అక్కడినుండి బ్రహ్మరంధ్రములోనికి ప్రవేశిస్తుంది. అక్కడి నుండి దానికి క్రిందవున్న సహస్రార చక్రములోనికి, అందులోనుండి భ్రూమధ్యము (రెండుకనుబొమ్మల నడుమభాగము) లోని ఆజ్ఞాచక్రములోకి వస్తుంది. అక్కడనుండి వెలుపలకి వస్తుంది. అదే పద్ధతిలో ఆమెలోని శక్తి అతనితలపైని బ్రహ్మరంధ్రములోనుంచి ప్రవేశించి సహస్రార ఆజ్ఞా చక్రముల ద్వారా వెలుపలకు వస్తుంది. అదే సమయములో వరుడు ఆమె భ్రూమధ్యములోకి... వధువు అతని భ్రూమధ్యములోకి సునిశితముగా చూచుకొనెదరు. దీనితో భ్రూమధ్యమునుండి వెలువడిన యిరువురి శక్తులు పరస్పర విరక్షణము వలన కలుసుకుంటాయి. అదే సమయములో ఒకప్రక్క పురోహితుల మంత్రోచ్ఛారణ, మరియొకప్రక్క మంగళవాయిద్యాల ఘోష కొనసాగుతుంటుంది. ఇలా చేయటం వలన అతనిలోని శక్తి ఆమెలోకి,



ఆమెలోని శక్తి అతనిలోకి ప్రవేశించి అనంతరము ఒకదానిలో ఒకటి లీనమవుతాయి. అటులనే ఒకరి సహస్రాల, ఆజ్ఞా చక్రములు మరొకరి ఆజ్ఞాసహస్రాల చక్రములతో పరస్పరము కలిసిపోతాయట. స్థూలముగా చెప్పవలయునంటే జీలకఱ్ఱ బెల్లము ఘట్టముద్వారానే చూపులు, మనస్సులు కలిసి వధూవరులు ఒకరికొకరు పూర్తిగా వశమౌతారన్నమాట.

## ఆరోగ్యధర్మములు :

జీలకఱ్ఱబెల్లపు మిశ్రమము వధూవరులు పరస్పరము ఒకరితలపై ఒకరు పెట్టటము అనే ఆచారము వెనుక ఆయుర్వేద వైద్యధర్మములున్నాయని అనుకొనవచ్చును. జీలకఱ్ఱను సంస్కృతములో జీరకః అనెదరు. "నజరా విద్యతేయస్మాత్" అని స్వయముగా వైద్యపితామహుడు చెరకుడే చెప్పినాడు. జీలకఱ్ఱ బెల్లము మిశ్రమము శరీరంలోని వేడిని తగ్గిస్తుందని కూడా కొందరు అనెదరు. ఏదిఏమైతేనేమి? ఈ ఘట్టము వెనుక యిటు సామాజిక, అటు వైజ్ఞానిక, మరోవైపు ఆయుర్వేద వైద్య ధర్మములున్నాయని అందులకే దానిని యిప్పటకీ కొనసాగించుతున్నారని ఒప్పుకోకతప్పదు.

## జీలకఱ్ఱ బెల్లము :

సుముహూర్తమునకు ముందుగా సభలోని వారందరకూ పురోహితుడు కొబ్బరిచిప్పతో అక్షతలు పంచును. భజంత్రీలు అందరూ వాయిద్యములు మ్రోగించుచుందురు. వధువును కూడా నెమ్మదిగా కళ్యాణవేదిక మీదకు తీసుకొనివచ్చి, వధువు తల్లిదండ్రులు మధ్యలో కూర్చుండబెట్టుకొని, వధూ వరులమధ్య తెల్లని తెర పట్టెదరు. జీలకఱ్ఱ బెల్లము మొత్తమునూరి ముద్దచేసి సుముహూర్తము దగ్గరపడగానే ముందుగా వధువుచేత వరునితలపై జీలకఱ్ఱ బెల్లము పెట్టించెదరు. తరువాత వరునిచేత వధువుతలపై జీలకఱ్ఱ బెల్లము పెట్టించెదరు. వధూవరుల పరస్పర ఆకర్షణకు లోనుకావటమునకు వేద ఋషులు దీనిని నిర్ణయించినట్లు చెప్పెదరు. వధూవరులు ఒకరికొకరు

నేత్రదర్శనము చేసుకొనుచూ ఒకరి తలపై ఒకరు ఈ జీలకఱ్ఱ బెల్లము పెట్టుకొనెదరు. ఒకవైపు చూపుల కలయిక, మరొకవైపు అనుబంధమును ద్విగుణీకృతము చేయు స్పర్శతోపాటుగా ఆ స్పర్శను సహజీవనమునకు నాందిగా నిలుపుకొనుటకు మేధస్సును చైతన్యపరిచే ఈ జీలకఱ్ఱ బెల్లము తలపై పెట్టెదరు.

తదుపరి పురోహితుడు వధూవరుల తల్లిదండ్రులు, బంధువులు, మిత్రులు, శ్రేయోభిలాషులు సభికులందరూ వరుస క్రమములో వేదిక వద్దకు వచ్చి "శుభమస్తు, కళ్యాణమస్తు, సంతాన ప్రాప్తిరస్థు, దీర్ఘాయురస్థు" అని పుష్పాక్షతలు వేసి దీవించెదరు. తరువాత సభికులందరూ ఎవరి స్థానములోకి వారు వరుస క్రమములో వెళ్ళి కూర్చొనెదరు. దీనితో పెండ్లిలోని ప్రధాన భాగము పూర్తయ్యినట్లు చాలామంది భావించెదరు. కొందరు మంగళసూత్ర ధారణ ప్రధానభాగమని భావించెదరు.

**వధూవరులకు తలంబ్రాలబట్టలు :**

ముందుగా వరునికి కన్యాదాతలు తలంబ్రాలుబట్టలు (నూతన వస్త్రములు) యిచ్చెదరు. అప్పుడు వరుడు నూతన వస్త్రములు తీసుకుని, జగదీశ్వరా ! ఈ వస్త్రముల ఏ అంతిమభాగాలున్నవో వాటన్నింటిలో నేవి పత్నిచే నేయబడెనో, ఆ వస్త్రములు నాకు జీవిత పర్యంతము శుభదాయకమగుగాక! అనగా వధువు సుస్వరూప ! నీ ఈ దేశీయ సుందరవస్త్రములు ధరించి నాతో సుస్వరూపుడవై జీవతాంతము వర్థిల్లుము అనును. కన్యాదాతలు ముందుగా వరుని తరువాత వధువును పుష్పాక్షతలతో ఆశీర్వదించెదరు.

వధువుకు ఎదురుగా వరుడు, వరుని తల్లిదండ్రులు ముగ్గురూ చీర, జాకెట్టు, తాంబూలము, పూలు, పండ్లు వున్న పళ్లెమును పట్టుకొని నిలబడి వధువుకు తలంబ్రాల బట్టలు యిచ్చుచూ వరుడు ఓ సౌభాగ్యవతీ ! ఆయుష్మతీ! నాకు తోడునీడగ వుండి నాతో నూరేళ్ళుకు మిన్నగా జీవింపుము. కనుక



నాచే ఈ దేశీయ సుందర వస్త్రములు ధరించి, సుస్వరూపిణివి కమ్ము. నూరేళ్ళకు మిన్నగానాతో జీవితాంతము సుఖసంతోషాలతో గడుపుము. అని పుష్పాక్షతలతో దీవించును. వధువు వస్త్రములను గ్రహించి మీరిచ్చిన నూలు వస్త్రములు నూరేళ్ళకు మిన్నగా నాకు ఆయురారోగ్యములొసగి కాపాడుగాక అని ప్రార్థించును.

తదుపరి వరుని తల్లిదండ్రులు ముందుగా వధువును, తరువాత వరుని పుష్పాక్షతలతో దీవించెదరు. తరువాత కన్యాదాతలు వరుని వధువులను పుష్పాక్షతలేచి దీవించెదరు. వధూవరులిర్వురు గృహము (గది) లోకివెళ్ళి తలంబ్రాల బట్టలు ధరించివచ్చెదరు. వధూవరులు నూతన వస్త్రములు ధరించి వేదికమీదకు వచ్చువరకు భజంత్రీలు వాయిద్యములు మ్రోగించుచుందురు. తరువాత వధూవరుల పెండ్లినాటి ప్రమాణములు.

**మేళతాళములు :**

ఈ మేళతాళములను గురించి ఏ వివాహగ్రంథమందు, ఏ వేదమునందు గాని చెప్పివుండలేదు. వివాహసమయములో ఏ క్రియయందు, ఏ సన్నివేశము నందు, ఏ సందర్భంనందు మేళతాళములు ఉపయోగించవలెనో తెలుపలేదు. మంత్రోచ్ఛారణ చేయునప్పుడు వాద్యఘోష పరిహరింపతగినదని నిషేదించిరి. ఇందువల్ల వివాహం జరుగునప్పుడు మేళతాళములు ఉపయోగింపరాదు. విరామసమయములందు మాత్రమే ఈ మంగళవాయిద్యములను ఉపయో గించుట ఉచితముసముచితమును. కానీ దైవజ్ఞులు, పండితులు, పెద్దలు వివాహసందర్భముననే గాక సమస్త శుభకార్యములందును సంగీత కళలు పోషించు ప్రధాన ఉద్దేశ్యముతో ఆదరించుట వలన మేళతాళముల ఆచారము బహుళవ్యాప్తి చెందినది. అందున పిల్లలకు, పెద్దలకు ఆనందంను కలిగించు చున్నది. మానవునిలోని కళాతృష్ణను వ్యక్తీకరించునట్టిదీ ఆచారము. అంతకుమించి ఈ ఆచారము వలన ఎట్టి ప్రయోజనము లేదనియు, ఈ

ఆచారము వివాహమునకు అవసరము కాదనియు విజ్ఞులు పెద్దలు గుర్తించి పెండ్లిండ్ల వ్యయమును తగ్గించుకొనెదరుగాక ! అసలు విషయమిది కాగా తుమ్ములు దగ్గులు అను అపశకునములు వినబడకుండుటకు గాను వివాహ ప్రారంభమునుండి చివరివరకు మంగళవాయిద్య ధ్వనులతో పెండ్లి కార్య క్రమమును గందరగోళము చేయుచుండిరి. కనుక పెద్దలు విజ్ఞులు యీ విషయములను గమనించెదరుగాక !

## వధూవరుల ప్రమాణములు :

"ఓం గృభ్యామితేసౌభగత్వాయ హస్తంమయాసత్యాజరదష్టిర్ యధాసః, భగోఆర్యయా సవితాపురంధిర్ మహ్యంత్వాదుర్గార్హ పత్యాయదేవాః" (ఋగ్వేదము) వరుడు వధువు కుడిచేతిని పట్టుకొని దేవీ ! నా వంశ కీర్తి ప్రతిష్టలను ఆశించి నీచేతిని పట్టుకొన్నాను. భర్తనైన నాతో వృద్ధాప్యము వరకు సుఖముగా జీవించుము. గృహధర్మములను నెరవేర్చుటకు భగవంతుడు యిక్కడి పెద్దలు నిన్ను నాకు యిచ్చిరి. నేటి నుంచి మనము ఒకరికొకరము విధేయులమై ఆదర్శజీవనమును గడుపుదాము. మన వంశాభివృద్ధిని కాంక్షించుచూ నాపట్ల ప్రేమతో వర్తించుము. త్రికరణశుద్ధిగా నీకు హాని తలపెట్టను. వ్యసనముల జోలికిపోను. అని వరుడు చెప్పును. మరియు వరుడు ఈ లోకము ధ్రువము. ప్రకృతి జగత్తు ధ్రువము, పర్వత సమూహము ధ్రువము. అటులనే యీకన్య పతినైన నాకులమున ధ్రువముగా నుండుగాక అని మరియు ఓ సౌభాగ్యవతీ ! నా జీవయాత్రలో నాకు తోడునీడగా వుండి ధర్మార్థకామమోక్షములకు నన్ను పురికొల్పి నా కష్టసుఖాలలో, నా సుఖ దుఃఖములలో, కలిమిలేములలో సగపాలుపంచుకొనుచూ నాకు మారాకుగా వుండి సర్వకాలములందు నాకు తోడ్పడమని నిన్ను అభ్యర్థిస్తున్నాను అనును.

అప్పుడు వధువు ఆర్యపుత్రా ! సౌభాగ్యమును ఆశించి నేను నీ పాణిని గ్రహించుచున్నాను. నాతో వృద్ధాప్యము వరకు సుఖముగా జీవించుము.



మనము గృహధర్మములను ప్రేమతో నిర్వహించెదము. నేటినుండి నీకునేను, నాకునీవు పరస్పర ఆధీనులమై వుండుముగాక ! అనుచూ వధువు చెబుతుంది. మరియు వధువు నాపతికులమునందు ధ్రువముగా నుండుగాక ! మరియు సుభగా ! మీరు నన్ను కోరిన విధముగా మనోవాక్కాయకర్మలందూ వంచన లేకుండగా తోడ్పడుచూ, మీ కష్టసుఖములలో, మీ సుఖదుఃఖములలో సమ భాగినినై, మీ కలిమిలేములందు సమముగా పాలుపంచుకొనుచూ అవ్యాజముగా సంచరించుచూ మీ జీవయాత్రను మిక్కిలి సుఖరము చేయుటకు పాటుపడుటకు వెనుదీయనని ఇరువురు ప్రమాణములు చేయుదురు. వీటినే పెండ్లినాటి ప్రమాణములందురు. తదుపరి పురోహితుడు చూర్ణికాపఠనము జరుపును.

## వధూవరుల తొలిస్పర్శ :

వధువు ఎడమకాలి బ్రొటనవేలుని వరుని కుడికాలి బ్రొటనవేలితో మొదట తొక్కించెదరు. అటులనే వరుని కుడికాలి బ్రొటనవేలును వధువు ఎడమకాలి బ్రొటనవేలిచేత తొక్కించెదరు. ఈ తొలిస్పర్శ నూతన వధూవరులలో అవ్యక్తా నందము కలుగజేయును. మేనులు పులకరింపచేయును. ఆ పులకరింపుతో నవదంపతులు పరవశులగుదురు.

## వధూవరుల శుభదృష్టి :

వధువు శిరస్సు మీద ఒక తమలపాకువుంచి దానిపై ఆవుపాలచుక్క వుంచి, వరుని కుడిహస్తమును, వధువు శిరస్సు మీదవుంచి, వరుడు "ఓ సౌభాగ్యవతీ ! నీవు సౌందర్యదృష్టి కలదానివికమ్ము. ఆ పతిఘాతినివి కమ్ము. ప్రతిపత్యను జహితైషిణివి కమ్ము. పుత్రప్రసన్నవు కమ్ము. ప్రకృతీశ్వరాభిలాషిణివి కమ్ము. సుఖభాగినివి కమ్ము. కళ్యాణకారిణివి కమ్ము. చతుష్పత పోషిణివి కమ్ము." అటులనే నేనూ ప్రవర్తించెదను. వధువు "ఓం నాతిచరామి" అటులనే మనజీవిత పర్యంతము నీతోనేను ప్రవర్తించెదను అనును.

శ్లో॥ సంతుష్టో భార్యయాభర్తా, భార్యాభర్తా తథైవచ, యస్మిన్నె
వకులే నిత్యం కళ్యాణం తత్ర వైధృవమ్ (మను3 అ 60శ్లో)

అప్పుడు పురోహితుడు శుభదృష్టిని చెప్పుచూ, ఏ కులమువారైననూ స్త్రీ పురుషులును, పురుషునిచే స్త్రీలలామయు సదాప్రసన్నులుగా వుండెదరో అట్టివారు నివసించు గృహము సుఖసంతోషములతో సిరిసంపదలతో తులతూగుచుండును. కనుక భాధ్యతనెరిగిన దంపతులుగా శుభదృష్టితో నూరు సంవత్సరములకు మిన్నగా ఆదర్శవంతమైన జీవితమును గడిపి కృతార్థులై వెలుగొందవలెనని మా ఆకాంక్ష. ఆశీర్వవచనమని పుష్పాక్షతలు వేచి దీవించును.

## మాంగళ్యధారణ :

ఏ వేదమునందైనను మాంగళ్యమును గురించి మంత్రములు లేవు. మానవ సమాజములో ఈ మాంగళ్యమును గురించి చాలా బలముగా ఆచార వ్యవహారములలో నున్నది. మన ప్రభుత్వము వారుకూడా మాంగళ్యధారణ జరగని వివాహము అంగీకరించుట లేదందురు. ఇందువలన పదిమంది నడచినబాటయే మంచిదని అందరూ మాంగళ్యధారణ చేయించుచుండిరి.

నీలలోహితములనగా నల్లపూసలు. ఈ పూసలయందు మహోన్నతమైన శక్తి వున్నదని శాస్త్రజ్ఞులు చెప్పిరి. వివాహమునకు పూర్వమే సుళ్ళు చూచెడి వారు. అట్టి సుళ్ళదోషము పోగొట్టునని శాస్త్రమునందు చెప్పిరి. ఇందువలన స్త్రీకి పురుషునికి దోషముతో కూడిన సుళ్ళకు స్పర్శించే విధముగా ఈ నల్ల పూసలను కట్టించెదరు. ఈ నల్లపూసలు కట్టిన, కట్టించుకొనిన వధూవరులు సంపూర్ణ ఆయురారోగ్యములతో వర్ధిల్లుదురని తెలిపిరి.

పురోహితుడు వేదమంత్రములతో మంగళసూత్రములతో కొబ్బరిచిప్పతో అక్షతలు ఆహ్వానితులందరకీ పంచుతాడు. వరుని తరుపున తీసుకుని రాబడిన మాంగళ్య ఆభరణములు నీలలోహితములు (నల్లపూసలు) పసుపు



కుంకుమలతో, గంధము, పుష్పములతో అలంకరించి, వధూవరులచేత షోడచోపచార పూజానంతరము, మంగళవాయిద్యములన్నియు మ్రోగించు చుండగా వరుడు వధువు మెడలో మాంగళ్యము మూడు ముడులు వేయును. ఆ మూడుముళ్ళపై పసుపు కుంకుమలు, గంధము, పూలు వుంచుచూ

శ్లో॥ మాంగళ్య తంతునానేన మమజీవన హేతునా
కంఠే బధ్నామి సుభగేత్వం జీవశరదాంశతమ్ ॥

శ్లో॥ ఓం నీలలోహితం భవతి కృత్యాసక్తిర్వ్యజ్యతే
ఏధంతే అస్యాజ్ఞాతయఃపతిర్బంధేషుబధ్యతే ॥

అని వరుడు పలుకును. నా జీవితమునకు మూలమైన హేతువైన ఈ మంగళ సూత్రమును నీ కంఠమున నేను కడుతున్నాను. నీవు నూరు సంవత్సరములకు మిన్నగా జీవించవలెననుచూ వరుడు మాంగళ్యధారణ చేయును. మాంగళ్య ధారణలో ప్రధానమైన ఒక వివరణ వున్నది. 1. పుట్టింటి మాంగళ్యము 2. అత్తింటి మాంగళ్యము. వరుడు మాంగళ్యమును కడతాడు. ఈ రెండూ రెండు కుటుంబముల కట్టుబాటులను బాధ్యతలను నిలబెట్టమనే సంకేతము లకు నిదర్శనముగా నిలుస్తాయి. అందుకే పుట్టినిల్లు, మెట్టినిల్లు బాధ్యతను తనపై పెట్టుకొని వధువు రెండు వంశములకు వారధిగా సారధిగా అత్తవారింట కుడిపాదము పెట్టి అలంకరిస్తుంది. కొండంత గౌరవం పొందుతుంది.

## మంగళసూత్రము మహాసూత్రము :

తాళిబొట్లలో దారము ఇమిడివున్నది. దారములో తాళిబొట్లు ఇమిడి వున్నాయి. ఇముడుకొనే శక్తి రెండింటికీ వున్నది. అలా ఇమడడమే అర్థనారీశ్వరత్వము. అలా ఇమిడిపోయిన శక్తిని ఆరాధించుటకు ప్రత్యక్ష ఆధారము మంగళసూత్రము. ఆ రెండు బొట్లు భర్త పాదములు. ఇహానికి, పరానికి అవే ఆధారములు. వానిని "ప్రేమ" అనే సూత్రము మాత్రము మూడుముళ్ళు వేసి పట్టుకుని వుంటుంది. ఆ మూడు ముళ్ళే త్రిపుటి. ఆ త్రిపుటియే సృష్టి. దానిమీదనే ఆధారపడివుంటుంది. ప్రేమసూత్రము, ప్రేమ

అంటే భక్తి, భర్తమీద ప్రేమభక్తి, బిడ్డలమీద ప్రేమాభిమానములు, వాత్సల్యము, ప్రేమ అనేది ఒకటే. కానీ స్థానమును బట్టి పేరులు మారుతుంటాయి. (జిల్లేళ్ళమూడి అమ్మ ఉవాచ)

## మాంగళ్యములలో అనేక రకములు :

దేవతలు సముద్రమును మదించునప్పుడు హాలాహలము పుట్టినది. లోక సంరక్షణార్థమై దానిని మింగమని దేవతలు శివుని వేడుకొనిరి. అప్పుడు శివుడు గౌరీదేవి వైపు చూశాడు. అప్పుడామె మనసు పరిస్థితి ఎలా వున్నదో ఊహించుకోవలసినదే. అయినా ఆమె సామాజిక హితము కోరి దానిని స్వీకరించమని భర్తకు చెబుతుంది. సాధారణ స్త్రీకి, మంగళసూత్రము విశిష్టతను నమ్ముకున్న పార్వతీదేవికి తేడా యిక్కడ స్పష్టమవుతున్నది. వివాహ సమయంలో వరుడు "మాంగళ్యం తంతునానేన" అనే శ్లోకము పఠించును. ఓ సుందరీ ! ఈ మంగళసూత్రమును నీ మెడలో కడుతున్నాను. నా జీవనము దీనిపైనే ఆధారపడియున్నది. నీవు శతాయుర్థాయమును పొందుతావని అర్థము. మాంగళ్యము ధరించిన స్త్రీ గౌరీఉపాసనకు, ఇతర వ్రతములను అనుష్టించేందుకు అర్హత పొందుతుంది. ఈ సూత్రము బార్యాభర్తల శాశ్వితాను బంధమునకు నిదర్శనము. అందుకే హాలాహలము మింగిన శివునిని పార్వతీదేవి మాంగళ్యబలము వలన అదేమీ చేయలేకపోయినది. పైగా అది శివుని కంఠములో అలంకారమే అయినది. దీని వలన శివుడు నీలకంఠుడు అయినాడు. అటులనే వధువు సౌభాగ్యముచేత, మంగళసూత్ర మహాత్మ్యము చేత వరుడు జీవనసంగ్రామములో విజయుడవుతాడు. కష్టములను అధిగమించుతాడు. "మమజీవన హేతునా" అన్న పంక్తికి ఇదే సాక్ష్యము. మంగళసూత్రమునకు గౌరీదేవి అధిష్టానదేవత. అందుకే ప్రతికన్య పెండ్లిలో ముందుగా గౌరీదేవి పూజ చేస్తుంది.

మన దేశంలో దక్షిణాదిలో పసుపుతాడుకు పుస్తెలను గుచ్చి వధువు మెడలో వరునిచేత పెండ్లిలో మూడుముళ్ళు వేయించెదరు. ఇదే మంగళ సూత్రము. తాళి మాంగళ్యము. పసుపు తాడుకి బదులుగా బంగారు గొలుసు ధరించి దీనికే పుస్తెలను కట్టుకోవటము జరుగుతుంది. ఆర్థికంగా వెనుకబడిన



వారు పుస్తెలకు బదులు వాటి స్థానములో పసుపుకొమ్మును తాడుకుకట్టి "తాళి"గా ఉపయోగించెదరు. తమిళనాడులో బ్రాహ్మణస్త్రీలు పుస్తెల స్థానంలో రెండేసి చిన్నగొట్టములను ధరించెదరు. బ్రాహ్మణేతరులు ఒకగొట్టము ధరించెదరు. వివాహితలు తలలో నాగారము వంటి ఆభరణమును జడమీద చేమంతిపూవు వంటి ఆభరణమును ధరించెదరు. చంద్రవంకలు, సూర్య వంకలు వంటి ఆభరణములు ధరించితే తమకు దైవానుగ్రహము కలుగుతుందని కొందరు విశ్వసించెదరు. రాళ్ళు పొదిగిన దేవతారూపములు తీర్చిదిద్దిన వడ్డాణములను బ్రాహ్మణవనితలు ప్రత్యేకంగా ధరించెదరు. ముక్కుకు రెండువైపుల పుడకలు కూడా ధరించెదరు.

మళయాళవనితలు ధరించే పుస్తెలు మరొక రకముగా ఉంటాయి. అవి పూవులు, పండ్లు, ఆకులు, కూరగాయల ఆకారములలోకాని, పాము పడగ ఆకారంలోకాని వుంటాయి. అవి మంత్రపోక్షితాలవటము వలన వాటిని ధరించితే వివాహితలకు గ్రహపీడలు చుట్టుకోవని వారి నమ్మకము. కేరళలోని "నంబారియాలు" హరిజన స్త్రీలు ధరించే "తాళి" చిన్నచిన్న గొట్టములతో కూర్చిన హారంవలె వుంటుంది. ఆ గొట్టములలో బీజాక్షరములు వ్రాసిన కాగితములు వుంటాయని అనెదరు.

కూర్గు తెగవారు బంగారుగొలుసుకు నల్లనిగుళ్ళు గ్రుచ్చి తాళిగా ధరించెదరు. ఆంధ్ర, కర్ణాటకలలో తాళితోపాటు నల్లపూసలు బంగారు గుండ్లు ధరించెదరు. నల్లపూసలకు దుష్టశక్తులను తరిమివేసే మహిమ వుంటుందని చెప్పెదరు. మంగుళూరు పరిసరములలో వివాహిత స్త్రీలు నాగుపాము ఆకారములో వున్న దండకడియములను ధరించెదరు. కపితాళి పగడముతోనూ, బంగారు గుండ్లతోనూ తయారైన మాంగళ్యము ధరించే పద్ధతి కర్ణాటకలో వున్నది. దక్షిణాదిలో క్రైస్తవ స్త్రీలు పెండ్లిగాజులతో పాటు తాళి కూడా ధరించెదరు.

ఉత్తరప్రదేశ్, బీహార్, ఒరిస్సాలలో దాదాపు ఒకేవిధమైన వివాహ సంకేతములు వాడెదరు. పాపిటలో నుదుటిపై పెట్టుకొనే సింధూరము, మట్టిగాజులు, కాలిమెట్టెలు మొదలైనవి ఒకేతీరుగా వుంటాయి. ఇక బెంగాలీ

వివాహిత మహిళలు సప్తలోహనిర్మితమైన గాజును ఎడమచేతికి వేసు కొంటారు. వివాహ వేళలలో పంజాబీ మహిళలు దంతముతో తయారైన ఎరుపు, తెలుపు గాజులను ధరించెదరు. జుట్టుపై "చౌక్" అనే ఆభరణమును ధరించెదరు. రాజస్థాన్‌లో స్త్రీలు తమ సాంప్రదాయానుసారముగా నగలును ధరించెదరు. పెండ్లయిన చిహ్నముగా ముక్కెరను పెట్టుకొనెదరు. నొసటి పైకి వ్రేలాడే విధముగా పాపటిబిళ్ళను ధరించెదరు. కాలిమెట్టెలు, గాజులు, గజ్జెలపట్టీలు ధరించెదరు.

చిన్నచిన్న పుస్తెలను మహారాష్ట్ర మహిళలు ధరించెదరు. ముత్యములు పొదిగిన ముక్కెరలను ధరించే ఆచారము కూడా వున్నది. ఇక గుజరాతీ స్త్రీల విషయములకు వొచ్చిన నగల పట్ల వారికి మక్కువ చాలా ఎక్కువ. ఆడంబరముగా ధరించెదరు. అనేక రకముల హారములు, రత్నాల గాజులు, చెవుల దుద్దులు, నాసికాభరణములు ధరించెదరు. వివాహమైన చిహ్నముగా అక్కడి స్త్రీ పాపిటిలో సింధూరము, కాలినడిమి వేలికి వెండి మెట్టెలను ధరించెదరు. మార్వాడీ స్త్రీలు పెండ్లిఅయిన గుర్తుగా ముక్కెరను, మట్టి గాజులను, సింధూరమును ధరించెదరు.

ముస్లీం స్త్రీలు సహితము పెండ్లిఅయిన చిహ్నముగా నల్లపూస దండలను ధరించెదరు. చంద్రుడు, నక్షత్రము ఆకృతులలో వున్న ఆభరణములు వధువు ధరిస్తుంది. ప్రాంతములు వేరైనను, కులములు వేరైనను వివాహవ్యవస్థలో తాళిబొట్టుకు ఒక ప్రత్యేకత వున్నది. తన మాంగళ్యము కోసము స్త్రీ నోములు, వ్రతములు చేయుట పరిపాటి.

**అక్షతలు :**

తెల్లని బియ్యమునకు పసుపు కలిపి అక్షతలు తయారుచేయుదురు. ఆ అక్షతలలో (మల్లె, బంతి, సన్నజాజి, కనకాంబరము, మందారము, గులాబి మొదలగు) పువ్వులు కలిపిన పుష్పాక్షతలు అవుతాయి. అయితే అక్షతలుగా బియ్యమునే ఎందుకు వాడతారని సందేహము కలుగవచ్చును. బియ్యము చంద్రునికి సంకేతము. చంద్రుడు మనఃకారకుడు. వధూవరుల మనోభీష్ఠమును సుస్థిరపరిచే శక్తిని సిద్ధింపచేయుటకు చంద్రగుణమునకు



సంకేతముగా బియ్యమును అక్షతలుగా వాడటము మన ప్రాచీన సాంప్రదాయముగా వచ్చుచున్నది. ఈ అక్షతలతో ఆశీర్వదించునప్పుడు వీటిని "అక్షతలు" అని వీటినే వధూవరులు తలలపై పోసుకొనునప్పుడు "తలంబ్రాలు" అని కూడా అనెదరు. తలంబ్రాలలో ముత్యాలను కలిపిన "ముత్యాల తలంబ్రాలు" అని కూడా పిలిచెదరు.

నిజమునకు అక్షతలతోటే పెండ్లికి సంపూర్ణత్వము చేకూరుతుంది. క్షతం కానివి అక్షతలు. అనగా ఎప్పటికీ నిలిచేవనీ, అమరమైనవి అని వేదార్థము. పెండ్లిపందిరిలోకి ఎందరో అనుభవజ్ఞులు, మహావ్యక్తులు, సుమంగళులు, సుసంతానవతులు, సుశీలురు, సుగుణవతులు, పతివ్రతలు తమచేతివ్రేళ్ళతో సమాజమునకు క్రొత్త నగిషీలు దిద్దిన నిపుణులు అతిథులుగా వచ్చెదరు. వారందరు వారివారి రంగములలో మనసా, వాచా, కర్మణా తలపండిన వారై వుండెదరు. అట్టివారిచేతుల స్పర్శతో వారి మనస్సు దీవెనలతో శక్తి పూరితమైన అక్షతలు వధూవరుల శిరస్సులపై పడడముతో ఒక అవ్యక్తమైన ఆనందానుభూతి, విజయానుభూతి కలుగుతుంది. అంతమంది బంధుమిత్రులు, శ్రేయోభిలాషుల అభినందనల వెల్లువలో అప్పుడే మానసికముగా నైతికబలముతో ఉత్తేజితులై వుంటారు. వధూవరులు ఇక తలపైన వర్షించే అక్షతలు వధూవరుల హృదయములలో నెలకొన్న భావములను దివినుండి దేవతలు కూడా "తథాస్తు" అనుచూ దీవించెదరు. ప్రకృతి దేవత ఆ సామూహిక శుభాశీస్సుల ఫలితమును సంపూర్ణముగా సిద్ధపరచుతుంది.

తదుపరి వరుడు లేచినిలబడి వధువు తలపై తన కుడిఅరచేతిని పెట్టి

శ్లో॥ ఓం సుమంగలీరియం వధూః ఇమాం సమేత పశ్యత

సౌభాగ్య మస్యైదత్వా యథాస్తం విపరేతనా॥ (ఋ 10-15-33)

అనును. తదనంతరము పురోహితుడు "మాంగళ్య నీలలోహితధారణ ముహూర్త స్సుముహూర్తోస్తు" అని పలికినప్పుడు వధూవరుల తల్లిదండ్రులు,

బంధుమిత్రులు, శ్రేయోభిలాషులు, సభికులందరునూ వరుసక్రమములో వేదికవద్దకు వచ్చి "శ్రీరస్తు, శుభమస్తు, సౌభాగ్యమస్తు, సంతానప్రాప్తిరస్తు, దీర్ఘసుమంగళీభవ, దీర్ఘాయురస్తు" అని పుష్పాక్షతలతో దీవించెదరు. తదుపరి సభికులందరూ వరుస క్రమములో వెళ్ళి ఎవరి స్థానములలో వారు కూర్చొనెదరు.

## తలంబ్రాలు :

నూతన దంపతులు వేడుకగా లేక వినోదరూపములో ఒకరికొకరు అతి సన్నిహితస్పర్శ జరుగుననే ఉద్దేశ్యముతో వివాహములో ఈ తలంబ్రాల రూపమును నిర్ణయించిరి. కానీ ఈ తలంబ్రాలు విధిని గురించి వేదధర్మముల నందు చెప్పలేదు.

పెండ్లిపండుగలో యిది ఎంతో వేడుక కలిగించే కార్యక్రమము. ఇందులో మొదటిగా వరుడు సమాజశ్రేయస్సు, కుటుంబవృద్ధి కాంక్షించే ఉత్తమ సంతానాన్ని అందివ్వమని దోసిలిఎత్తి తలంబ్రాలు పోస్తాడు. అందుకు తలవంచి అంగీకరించుచూ వధువు ఆ సంతాన జీవనగమనమునకు తన వంతుగా తలంబ్రాలు పోస్తుంది. దానికి సమాధానముగా వరుడు నేను అందించే ఆర్థికసంపదను అణకువగా, సమయోచితముగా వినియోగించమని తిరిగి తలంబ్రాలు పోస్తాడు. ఆ తరువాత ఇరువురు త్యాగముతో, ధనముతో సహజీవనము సాగిద్దాము. బ్రతుకుబాధ్యతను సమానముగా పంచుకుందా మని ఒకరిపైఒకరు వరుసగా తలంబ్రాలు పోసుకొనెదరు. అని అవి వధూ వరులకు అవి పెండ్లినాటి ప్రమాణములు. పెండ్లి చూచేవారికి వేడుకలు. మంగళసూత్రధారణ జరిగిన తరువాత వధూవరులు తలంబ్రాలు పోసుకుంటూ వుంటే "సీతారాముల కళ్యాణము చూతము రారండీ. చూచు వారలకు చూడముచ్చటగ, పుణ్యపురుషులకు ధన్యభాగ్యమట" అనుచూ భజంత్రీలు వాయించుచూవుంటే ఆ వేడుకను వర్ణించటము వేయి పడగల ఆదిశేషునికైనా వీలుకాదనేది సత్యము. అదీ మన వివాహ వ్యవస్థలోని



పటిష్టత, మన సంస్కృతిలోని విశిష్టత. ఈ విధముగా తలంబ్రాలు పూర్తి అగు వరకు పోసుకొనెదరు. పెండ్లిలో ఇదొక మరువరాని మరచిపోలేని ఒక మధురమనోజ్ఞఘట్టము. సుమధుర సన్నివేశము.

తలంబ్రాల అనంతరము పురోహితుడు "ఓం శాంతిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, వృద్ధిరస్తు, అవిఘ్నమస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, స్వస్తి శివసంకల్పమస్తు" అని పుష్పాక్షతలతో ఆశీర్వదించును.

## బ్రహ్మముడులు :

పురోహితుడు తాంబూలంలో దక్షణ, రెండు కర్జూరపు కాయలు, పూలు, అక్షతలు పెట్టి ముందుగా వధువుకి యిచ్చి, వరుని పైవస్త్రము కొంగున వుంచి ముడివేయించవలెను. తరువాత వరుడు వధువుపైట చెరగున తాంబూలము, దక్షణ, రెండు కర్జూరపు పండ్లు, పూలు, అక్షతలు వుంచి ముడివేసి, పమిటచెంగును, తనపైపంచచెరగును రెండింటినీ కలిపి ముడులు వేయవలెను. పురోహితుడు వధూవరులకు బ్రహ్మముడులు వేయరాదని మనువు, పారాశర్యగృహ్య సూత్రములందు చెప్పబడినది. కనుక వధూవరులే స్వయముగా బ్రహ్మముడులు వేసుకొనవలెను. పురోహితుడువేచి కొనునట్లు తెలిపి వేయించవలెను. కానీ అనుభవములో పురోహితులే బ్రహ్మముడులు వేయుట చూచుచున్నాము. నేను చూచిన అన్ని వివాహములలో పురోహితుడే బ్రహ్మముడులు వేసినాడు.

ఈ బ్రహ్మముళ్ళ మంత్రమునందు ఒకరిహృదయమునుఒకరు ప్రేమ పాశములతో బంధించుటయే అని చెప్పబడినది. ఈ బ్రహ్మముడులు ఈ విధముగా ముడులు వేయవలయునని చెప్పటయే పురోహితుని బాధ్యత అని గ్రహింపవలయును.

## అగ్నిప్రతిష్ట, ప్రదక్షిణములు :

వివాహమందు అగ్నిప్రతిష్టవలన భగవంతుడిని ప్రార్థించినట్లు అగును. భగవంతునికి అగ్ని అనుపేరు కలదు. ఈ అగ్నిప్రతిష్ట వలన మానసిక ప్రశాంతత వధూవరులకు కలుగును. ప్రకృతిలో అగ్ని అనునది మిక్కిలి

శక్తికలది. ఇది మాలిన్యమైనను నశింపచేయు వాయుశుద్ధి కలిగించును. సూర్యభగవానుడు అగ్నితత్వము కలిగియున్నాడు. సూర్యుని కిరణముల వలన ఓజస్తేజములు కలుగునో ఏ విధముగా మాలిన్య నిర్మూలనము జరుగునో అట్లే ఈ అగ్నిలో వేయు హోమద్రవ్యములు, నేతి వలన వచ్చు పరిమళములతో కూడిన వాయువు వధూవరులకు, తల్లిదండ్రులకు ఆయురారోగ్యములను కలిగించునని వేదధర్మములందు చెప్పిరి. వధూవరులు ముమ్మారు అగ్నిచుట్టూ ఆత్మప్రదక్షిణ చేయుచూ ప్రమాణములు చేసి నమస్కరించెదరు.

**పాణిగ్రహణము :**

పాణిగ్రహణమనగా వధూవరులు ఒకరిపాణి (చేతిని) ఒకరు పట్టుకొనుట. దీనినే వివాహతంతులో "పాణిగ్రహణము" అందురు. ఈ క్రియ పరస్పర ఐక్యతను వెల్లడించుచున్నది. ఈ నవదంపతులు తమ కష్టసుఖములను పరస్పరము గ్రహించి అన్యోన్యముగా చేదోడువాదోడుగా దాంపత్య జీవితము సాగించెదము అని దృఢముగా పెద్దలెదుట దీక్షబూనుటయే పాణిగ్రహణ భావము. ఇంతకుముందు చేసిన ప్రమాణములలో చెప్పబడిన పరస్పర ప్రేమాభిమానములు, స్నేహము, మైత్రి మున్నగునవి ఎలా పాణిగ్రహణంతో దృఢమగును. ఈ పాణిగ్రహణము చాలా విశిష్టమైనది. అందువలననే వివాహమును పాణిగ్రహణము అనే పేరుతోకూడా పిలుచుచుండిరి.

వరుడు ముందుగాలేచి వధువుకు ఎదురుగా నిలబడి తన కుడిహస్తముతో వధువు కుడిహస్తమునందు పువ్వులు అక్షతలు వుంచి, వరుడి హస్తముతో వధువు కుడిహస్తమును పట్టుకొనును. వధువును వరుని ఎదురుగా నిలబడి తన కుడిహస్తముతో వరుని కుడిహస్తమునందు పువ్వులు అక్షతలు వుంచి, వధువు కుడిహస్తముతో వరుని కుడిహస్తమును పట్టుకొనును.

**వరుడు:–** ఓ సౌభాగ్యవతీ ! ఈ పెండ్లిపెద్దల ఎదుట నీ పాణిగ్రహణము చేసి, నిన్ను ధర్మపత్నిగా స్వీకరించుచున్నాను. పెద్దలు చెప్పినట్లుగా నీవు అర్ధాంగివేకాక అర్ధసర్వస్వమగుదువుగాక ! నీవు నేను అను భేదభావము లేకుండగా మన జీవనయాత్ర గడుపుదాము.



**వధువు:–** ఓ సుభగా ! మీతో జీవనయాత్ర గడపవలయునని అభిలషించి ఇదిగో నాపాణిని మీకు అందించుచున్నాను. నా జీవితకాలమంతా స్త్రీ జన సహజమైన ఓర్పుతో పేరిమితో మీకు తోడ్పడెదనని ప్రమాణం చేయుచున్నాను అనును. తరువాత మూడు పర్యాయములు అగ్ని చుట్టూ ఆత్మప్రదర్శన చేయుదురు.

**పూలదండలు :**

మొదట వధువు వరుని మెడలో పూలమాలవేచి నమస్కరించుతుంది. తదుపరి వరుడు వధువు మెడయందు పూలమాలవేచి ఆశీర్వదించుతాడు. పిమ్మట పెద్దలందరూ దీర్ఘాయుష్యారారోగ్య సంపన్నులరై వర్ధిల్లవలెనని నూతన దంపతులను ఆశీర్వదించెదరు. ఆ తరువాత నూతనదంపతులు కళ్యాణ మహోత్సవమునకు విచ్చేసి మమ్ము గృహస్థులనొనర్చి ఆశీర్వదించిన పెద్దలందరకు మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములని సభికు–లందరకు తెలిపెదరు.

తరువాత పురోహితుడు నూతన దంపతులారా ! ఈ పుష్పములు ఏ నిండుదనమైన పరిమళములతో సహజముగా కూడియున్నవో ! అటులనే మీ దంపతులుకూడా సహజమైన ప్రేమానురాగములతో నూరు సంవత్సరము లకు మిన్నగా జీవించి, సుఖసంతోషములతో, సిరిసంపదలతో, సుసంతాన సౌభాగ్యములతో, సకలైశ్వర్య భోగభాగ్యములతో వర్ధిల్లవలయునని ఆ పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించుచూ ఈ పూలమాలలు ఒకరిహృదయమందు మరొకరు వుంచుకొన్న మీ దంపతులను ఈ పెండ్లిపెద్దలు సర్వదేవతలు సదా ఆశీర్వదింతురు గాక ! అని పలుకును.

**శిలారోహణము :**

శిలారోహణమనగా సన్నెకల్లు తొక్కించుట. ముందుగా వధువు కుడిచేతిని గంధపు సాన (సన్నెకల్లు) పై వుంచి, తరువాత వరుడి కుడిచేతిని ఆమెచేతిపై వుంచి దేవీ ! నీవు ఈ శిలను తాకుము. ఈ శిలాన్యాయముగా పతి కులమునందునూ ధర్మమునందునూ స్థిరచిత్తమై వుండుము. కలహకారులకు

దూరముగా నుండుము. శక్తికొలది సహకారమిమ్ము. అటులనే ఇతరుల సహకారమును పొందుము. మన మిర్వురము మన గృహమందు స్థిర రూపులమై వుండునట్లుగా ఈ ప్రకృతి మనలను కాపాడుగాక ! అని పలుకును.

## కేశ విమోచన :

వివాహ సమయమున మధ్యలో వధూవరులు ఏకాంతమున జేరి ఈ క్రియను జరుపుటకు వీలుండదు. ఇందువలన వేదికమేదనే వరుడు వధువు తలవెంట్రుకలకు సువాసనలను వెదజల్లు నూనెరాసి అలంకరించుతాడు. ఇది బార్యాభర్తలలో పరస్పర సేవాతత్పరత పెంపొందించేందుకు పెద్దలు ఈ ఆచారమును చేసినారని మనము భావించవచ్చును. ఈ ప్రక్రియ ఆచరణలో లేదు.

## సప్తపది (ఏడడుగులు నడచుట) :

వధూవరులిరువురును అగ్నికి ఉత్తరప్రక్కగా తూర్పుగానైన, ఈశాన్య దిశగానైన ముందుగా వధువు కుడిపాదము వుంచి నడచుచుండగా, వరుడు వధువు కుడిహస్తమును పట్టుకుని వరుడుకూడా వధువుతోపాటు ఏడడుగులు నడవవలయును. ముందుగా అగ్నికి ఉత్తరప్రక్కన, పడమరనుండి తూర్పుగా నుండునట్లుగా ఏడు తమలపాకులుంచవలెను. తరువాత కుడిపాదము ముందు పెట్టి నడవవలెను. పురోహితుడు (ఆచార్యుడు) సప్తపది భావములను వధూవరులకు ప్రభోదించును.

వివాహక్రతువులో సప్తపదీగమనము అతి ముఖ్యమైన కారిక. వధూవరులు తాముచేసిన ప్రమాణములను పునశ్చరణ చేయుటయే దీని అర్థము. ఈ సప్తపదీ గమనమువలన దాంపత్య జీవితము స్థిరపడును. దంపతులిరువురు కలసి మెలసి గృహస్థాశ్రమ ధర్మములను సమమగు దృష్టితో ఆచరించి ఫలితము పొందుటయే. ఈ సప్తపదీ ఆగమనముతో సుసంతానవంతులై జీవయాత్రను సాగించుటయే ధర్మమని చెప్పిరి. అప్పుడు పురోహితుడు వధూ వరులచేత "నాతిచరామి" అని ప్రమాణము చేయించుతాడు. జీవితమంతా



కలిసిమెలసి వుంటారని ఇద్దరిచే ప్రమాణములు చేయించుతాడు. జీవితమంతా ఎటువంటి అపార్థములు, అపోహలు లేక జీవితమంతా కలిసి మెలసి వుంటారని ఇద్దరిచే ప్రమాణములు చేయించుతాడు. ఏడడుగులు నడిపిస్తాడు. ఏడేడుజన్మల అనుబంధమే ఈ ఏడడుగుల సంబంధం అనీ భావించెదరు.

**పురోహితుడు:–** నూతన దంపతులారా ! మీరుభయులు కలసి మెలసి ఆహారము కొరకు ప్రయత్నము చేయుడు. మీ శక్తికొలది ఇతరులకు సహాయ సహకారములు చేయుడు. సుసంతానముతో వర్థిల్లుడు. పెద్దలు మీకు ఆశీస్సులు ఇచ్చెదరు. అట్టి దృష్టితో మీ గృహమందు మొదటి పాదముంచుడు.

సుగుణ జ్ఞానసంపన్నులారా ! ఆహారమును భుజించిన శరీర సౌష్టవము కలుగును. అట్టి బలముతో అన్ని కార్యములను శ్రద్ధగా చేయగలరు. అట్టి శరీర సౌష్టవము మీకు నూరేండ్లకు మిన్నగా తేజోరూపులై వర్థిల్లుడు. సుసంతాన సౌభాగ్యములు పొందుడు. అట్టి భావముతో రెండవ పాదముంచుము.

నవదంపతులారా ! మీరు ధనమును సంపాదించుటకు ఏవిధముగా ప్రయత్నములు చేయుచున్నారో ! అటులనే దైవజ్ఞులవద్ద జ్ఞానపుష్టిని పొందుడు. సుసంతాన సౌభాగ్యములతో వర్థిల్లుడు. అట్టి దృష్టితో మూడవ పాదముంచవలెను.

సుగుణస్వరూపులారా ! మీ సౌఖ్యముకొరకు ఎటుల ప్రయత్నించుదురో! అటులనే యితరులు వారి వారి సౌఖ్యములకొరకు ప్రయత్నము చేయిచుందురు. కనుక యితరులు చేయు ప్రయత్నములను చూచి అసూయ పడరాదు. మీ సహాయసహకారములను అందివ్వండి. సుసంతాన సౌభాగ్యము లతో వర్థిల్లుడు. అట్టి దృష్టితో నాలుగవ పాదముంచవలెను.

అనురాగదంపతులారా ! మంచి మనస్సులతో సంపూర్ణ అనురాగములతో కలసిమెలసి సుసంతానమును పొందుడు. వారిని విద్యా విజ్ఞాన సంపన్నులుగా తీర్చిదిద్ది మానవసేవ, దేశసేవ పారాయణులుగా వర్థిల్లజేయుము. అట్టి దృష్టితో ఐదవ పాదముంచవలెను.

సువిజ్ఞానదంపతులారా ! ఈ ప్రకృతియందు ఆరు ఋతువులు కలవు. ఏ ఋతువునందు ఏ దుస్తులు ధరించినా, ఏ పదార్థములు భుజించినా శరీరమునకు ప్రాణమునకు బలము కలుగునో ! ఆయా ఋతువులకు మీరు ఉభయులు అనుకూలముగా నడచిన ఆనందము పొందగలరు. అట్టి దృష్టితో ఆరవ పాదముంచవలెను.

సుగుణసంపన్నులారా ! ఈ ప్రకృతియందు ప్రతిజీవి తమ సౌఖ్యముల కొరకు ప్రయత్నము చేయును. అటులనే మీరిరువురును పరస్పరానురాగము సౌఖ్యము కొరకు ప్రయత్నము చేయుదు. ఇతరులకు హాని కలుగజేయరాదు. సుసంతాన సౌభాగ్యములతో వర్థిల్లుడు. ఈ సప్తపదీ ఆగమనముతో బాధ్యతా యుతమైన ఆదర్శ దంపతులుగా వర్థిల్లుడు. ఇట్టి దృష్టితో మీ గృహము నందు ఏడవ పాదముంచవలెను. తదనంతరము నూతన వధూవరులకు అగ్నికి ముమ్మారు ప్రదక్షిణముగా తిరిగివచ్చి యథాస్థానములందు కూర్చొనెదరు.

## మట్టెలు, పిల్లేళ్ళు :

వధువుకు మేనమామలు లేక తల్లితరపున తాతముత్తవలు నవవధువుకు మట్టెలు, పిల్లేళ్ళు, చీర, జాకెట్టు, పసుపు కుంకుమలు, పూలు పండ్లు ఇచ్చుట మన తెలుగువారి సాంప్రదాయముగా వచ్చుచున్నది. ఈ కన్యను ఈ వరుడు స్వీకరించిన తరువాత మీరు యిరువురు గృహస్థాశ్రమము నందు ప్రవేశించి భార్యాభర్తలుగా వుండుటకు మేము అంగీకరించి మా మేనకోడలుకు లేక తాతముత్తవులైన మా మనుమరాలుకు పాదాలంకరణకు మట్టెలు, పిల్లేళ్ళు చీరజాకెట్టు, పసుపు కుంకుమలు, పూలుపండ్లు అక్షతలు యిచ్చి పెండ్లి పెద్ద లక్షమక్షమందు మనసా వాచా కర్మణా త్రికరణ శుద్ధిగా ఆశీర్వదించుచున్నాము అని అంగీకారము తెలియజేయుదురు. ముందుగా వధువుకు గంధము రాసి, బొట్టుపెట్టి పళ్ళెము అందించెదరు. తరువాత కాలి బొటనవ్రేళ్ళ ప్రక్కవేళ్ళకు మట్టెలను, నాలుగవ వేళ్ళకు పిల్లేళ్లను తొడిగి పుష్పాక్షతలు వేసి ఆశీర్వదించెదరు.



**వధువునకు మేనమామ దంపతుల హితోక్తులు:–** పతిగృహమున ధైర్యముగా వుండుము. భర్తతో అత్తమామలతో ఆడపడుచులతో బంధు మిత్రులతో మైత్రి గలిగియుండుము. కుటుంబ శ్రేయస్సునకై పాటుపడుము. భర్తమాట అత్తమామల మాట జవదాటకుము. మీ తల్లిదండ్రులను అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను బంధుమిత్రులను ఎట్లు ప్రేమించెదవో ! అటులనే భర్త తల్లిదండ్రులను బంధువులను ప్రేమించుము. భర్తతో కలిసి భుజింపుము. భర్తను సుఖదాతగా తలంచుము. భర్తతో సహానుభూతి కలిగి యుండుము. అని నవవధువుకు మేనమామ దంపతులు, లేక తాత ముత్తవలు పెండ్లికుమార్తె తల్లిదండ్రులు హితోక్తులు పలికి పుష్పాక్షతలతో ఆశీర్వదించెదరు. ఈ రోజులలో యీ హితోక్తులు చాల అవసరమగుచున్నవి.

## వధూవరులకు చదివింపులు :

పూర్వము యీ వధూవరుల తల్లిదండ్రులకు ఆర్థిక పురోభివృద్ధికి సహాయ పడతాయని యీ చదివింపుల కార్యక్రమము ప్రవేశపెట్టునట్లుగా మనకు తెలియుచున్నది. వధూవరుల తల్లిదండ్రులు పెండ్లిఖర్చులకు అప్పులు బాకీలు చేసివుంటారు. వారికి చదివింపుల రూపేణా వచ్చిన రొఖ్ఖము, సామగ్రి కొంతకు కొంత సహాయకారిగా వుంటుందని తలచి పెద్దలు పెండ్లిలో బంధు మిత్రులు తమ తమ యథాశక్తి కొలది యిచ్చు చదివింపులు భార్యాభర్త సంసార జీవనమునకు పనికివస్తాయని ఈ విధముగానైనా కొంత సహాయ పడినట్లు సంతృప్తి చెందెడివారు. కాని యీ రోజులలో సహాయపడు దృష్టి దృక్పథములో మార్పు వచ్చినందువలన ప్రేమాభిమానములు ఆప్యాయతలు తగ్గినందువలన యీ చదివింపులు చాలవరకు తగ్గిపోయినవి. వధూవరులకు యీ సహాయసహకారములంత అవసరము కూడా లేదనుకొనుచుండిరి. కొన్నిచోట్ల చదివింపులు వున్నయెడల వధూవరులకు బంధుమిత్రులు శ్రేయోభిలాషులు యివ్వదలచిన రొఖ్ఖరూపమునగాని, వస్తురూపమునగాని పెండ్లికానుకల రూపమున బహుమతుల రూపమున బహూకరణ రూపమున

ఎవరికి వారు ఒక కాగితముపై వ్రాసి వేదికవద్దకు వచ్చి వధూవరులకిచ్చి ఆశీర్వదించెదరు.

పురోహితుడు "ఓం శతమానం భవతి శతాయుః! పురుషశ్శేతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్టతి ! దీర్ఘమాయుః !" అని పుష్పాక్షలతో నూతన దంపతులను ఆశీర్వదించి, కన్యాదాతలకు నూతన వధూవరులకు ముంజేతి దీక్షాకంకణములను విప్పి, అరివేణి (గరికబుడ్డి) లో పెట్టును. పెండ్లికుమార్తె గారి చాకలికి పెండ్లికుమారుని గారి తరపున పెండ్లికుమారుని గారి చాకలికి పెండ్లికుమార్తెగారి తరపున దక్షిణ, తాంబూలము, పండ్లు యిప్పించెదరు. (ఈ పెండ్లి వేడుకలు ఒకప్రక్క జరుగుచుండగా రెండవప్రక్క వధువు తరపు వారు ఆహ్వానితులందరకూ ఏర్పాటు చేయబడిన భోజన కార్యక్రమములు జరుగుచుండును.)

## వధూవరుల జలక్రీడలు :

ఒక బిందెలో సగమునకు నీళ్ళుపోసి బంగారపు ఉంగరము, వెండిమెట్టె పురోహితుడు బిందిలోవేయును. వధూవరులు ఎవరు బంగారపు ఉంగరమును ముందుగా తీసెదరో, వెండిమెట్టెను ఎవరు తీసెదరో ఆ విషయమును చుట్టూరు వున్న ముత్తయిదువలకు, పెద్దలకు చెప్పెదరు. ఈ విధముగా బంగారపు ఉంగరమును వెండిమెట్టెను మూడు పర్యాయములు తీయించెదరు. మూడు పర్యాయములలో ఎవరు రెండు పర్యాయములు ఉంగరము తీసెదరో వారు గెలిచినట్లుగా అనుకొనెదరు. ఇది భవిష్యత్ విజయములకు పునాది అవుతుంది.

## శ్రీసూర్యభగవానుని సందర్శనము :

సూర్యోదయము నుండి సూర్యాస్తమయములోగా (పగలు) వివాహము జరిగిన వధూవరులు ప్రత్యక్షదైవమైన శ్రీసూర్య భగవానుని సందర్శించవలెను. సప్తపది అయిన తరువాత శ్రీసూర్య భగవానుని సందర్శించి దంపతులు తేజోవంతులై శ్రీసూర్య భగవానుని వలె జీవితాంతము పరోపకారులై వర్థిల్లెదరు.



**వధూవరులు:–** హే సూర్యభగవానుడా ! నీ తేజస్సును మేము నిత్యము జ్ఞానదృష్టితో చూచెదముగాక. నీకృపచే నూరు సంవత్సరములు సుఖ సంతోషాలతో, సకలైశ్వర్యభోగభాగ్యములతో, సుసంతాన సౌభాగ్యములతో జీవించెదము గాక ! శతవర్షములకు పైగా జ్ఞానోపదేశము చేయుచూ, పొందుచూ జీవించెదము గాక ! అని ప్రత్యక్షదైవమైన శ్రీసూర్య భగవానుని ప్రార్థించి ముమ్మారు నమస్కరించెదరు.

## ధ్రువనక్షత్ర సందర్శనము :

సూర్యుడస్తమించిన తరువాత (రాత్రి) వివాహము జరిగినయెడల ధ్రువ నక్షత్రమును వధూవరులు సందర్శించవలెను. ధ్రువనక్షత్ర దర్శనము పొందిన దంపతులు ధర్మమును ఆచరించుట యందు ధ్రువముగానుండి, చలించకుం–డుటకు గాను నిత్యము మీ దంపతులు ధ్రువనక్షత్రమును సందర్శించుచూ, వర్థిల్లుము. కానీ నేడు పగలు వివాహము జరిగినను, రాత్రి వివాహము జరిగినను ధ్రువనక్షత్ర సందర్శనమును పురోహితులు చేయించుచున్నారు. శ్రీసూర్యభగవానుని సందర్శనము చేయించుట ఆచారములోలేదు. కారణము తెలియదు.

వివాహము పూర్తికానున్న తరుణములో పురోహితుడు నవవధూవరులను ఆరుబయటకు తీసికొనివచ్చి ధ్రువనక్షత్రమును చూపించుచున్నారు. అది ఆకాశములో కనిపించినా, కనిపించకపోయినా వధూవరులిర్వురు "ఓ ధ్రువ నక్షత్రమా ! నీ వలె మా దంపతులము ధ్రువముగా నుందుముగాక ! అందులో ప్రకృతి మాకు సంపూర్ణ ఆయురారోగ్యములు, భోగభాగ్యములిచ్చి కాపాడుగాక ! అని నిత్యము ప్రార్థించుచుండెదముగాక ! అని ప్రార్థించి ముమ్మారు నమస్కరించెదరు.

## అరుంధతీ నక్షత్ర సందర్శనము :

వివాహవేడుకలలో వధూవరులకు అరుంధతీ నక్షత్రము చూపడము ఒక ముఖ్యమైన ఆచారము. దీనివెనుక ఎంతో అర్థము పరమార్థము దాగున్నవి. అందుకే యీ ఘట్టమునకు అంత ప్రాధాన్యము ఇచ్చారు పెద్దలు.

కుటుంబమునకు రెండు కళ్ళులా వుండవలసిన భార్యాబర్తలు పరస్పర గౌరవముతో, ప్రేమాభిమానములతో వుండవలయునని యీ ఆచారము వెల్లడించుచున్నది. అన్యోన్యతను పెంపొందించుకోవడమునకు తొలిమెట్టుగా కూడా దీనిని పరిగణింపవచ్చును. అలాగే భర్త భార్యకు అనుక్షణము రక్షణ కల్పించుచూ కాపాడవలయునన్న బాధ్యతనూ యిది వెల్లడించుచున్నది.

పెండ్లి జరిగిన వెంటనే పురోహితుడు వధూవరులను ఆరుబయటకు తీసికొని వెళ్లి ఆకాశములో అరుంధతీ నక్షత్రమును చూపించును. ఆ సమయములో వధూవరులు ప్రక్కప్రక్కన భుజములు వరుసుకొనుచూ తాకేలా నిలబడి దీనిని చూచెదరు. ఇది భార్యాభర్తల అన్యోన్యతకు చిహ్నముగా భావించెదరు. ఆ క్షణములో వారు ఎంత అన్యోన్యముగా వున్నారో అలాగే జీవితాంతము వుండవలయునన్న సందేశము యిందులో యిమిడివున్నది. అరుంధతీ నక్షత్రము సప్తర్షి మండలములో వశిష్ఠుడి వెనుక మినుకు మినుకు మంటూ కన్పించుచుండును. సప్తర్షి మండలమంటే ఆకాశములో మంచం కోళ్ళులా కాకపోయినను కొద్దిగా అదేమోస్తరులో నాలుగు నక్షత్రములు కన్పించుతాయి. వాటికి తోకగా మరోమూడు నక్షత్రములుంటాయి. ఈ ఏడు నక్షత్రములే సప్తర్షులు. వీటిలో వశిష్ఠుడి వెనుక కనుపించీ కనుపించ కుండగా వుంటుంది అరుంధతీ నక్షత్రము. రాత్రివేళ సహితము అది మామూలు కంటికి సుస్పష్టముగా కన్పించదు. భర్త రక్షణలో వున్న భార్యను చూపడములో వుద్దేశ్యములు ఎన్నో వున్నాయి. కొన్ని వరునకు వర్తించెడివి. కొన్ని వధువుకు చెప్పదలుచుకొన్నవి. ఉదాహరణకు అరుంధతిని తన వెనుక వుంచుకొని వశిష్ఠుడు సదా రక్షించునట్లుగా భార్యను ఎల్లవేళలా కాపాడమని వరునికి చెప్పడము ఒక ఉద్దేశ్యమయితే, భర్తకు జీవితాంతము వెన్నుదన్నుగా నిలిచి అతనుచేసే కార్యక్రమములకు సహకరించడము ద్వారా సంపూర్ణత్వమూ తీసుకురమ్మనమని వధువుకు చెప్పడము మరో అంశము.

అంతేకాదు అంత సుదూరముగా వున్న నక్షత్రమును చూడగలిగే కంటిచూపు వరుడికి వున్నదా? లేదా? అనెడిది ఒక పరీక్షగా కొందరు



భావించెదరు. గృహస్థుపాత్ర పోషణకు సిద్ధమౌతున్న వరుడికి అన్ని విషయములలోనూ "సునిశితదృష్టి" అనెడిది అత్యంత అవసరము అన్నది ఇందులోని అంతరార్థము. అటులనే కంటిచూపు ఆధారముగా ఆయుర్థాయమును గణించే పద్ధతులూ వుంటాయట. అందుచేత అరుంధతీ నక్షత్ర సందర్శనము ద్వారా వరుడి ఆయుర్థాయమును లెక్కకట్టతారని మరి కొందరు నమ్మెదరు. ఏదిఏమైనా భార్యాభర్తలు ఒకరికి ఒకరై సుఖ సంతోషము లతో కలకాలము జీవించవలయుననే ఆకాంక్షే యీ ఘట్టములో కనబడు తుంది. ప్రాచీన కాలములో ఖగోళశాస్త్ర పరిజ్ఞానమును వధూవరులకు తెలియ జేయుటకు ఇదో ప్రయత్నమని చెప్పెడివారూ లేకపోలేదు. అంతేకాదు అరుంధతీ నక్షత్ర దర్శనము వలన కంటికి వుత్తేజము కలుగుతుందని కూడా ఒక నమ్మకము.

## అసలు అరుంధతి ఎవరు? :

అరుంధతి వశిష్ఠునికి భార్య. ఉత్తమ ఇల్లాలు. భర్తకు అన్నివేళలా వెంట వుండి సహధర్మచారిణి పదమునకు అర్థముగా నిలచిందామె. అంతేకాదు ఒకసారి విశ్వామిత్రుడు వశిష్ఠుడిపై అక్కసుతో, ఆయన కుమారులను శపిస్తాడు. ఆ విషయము తెలిసి వశిష్ఠుడు తీవ్ర ఆవేదనకు లోనవుతాడు. జీవితముపై విరక్తిచెంది నదిలో దూకి చనిపోవడానికి నిర్ణయించుకొంటాడు. కాళ్ళుచేతులు తాళ్ళతో బంధించుకొని మరీ ఆయన నదిలో దూకుతాడు. అయితే ఆ నదీమతల్లి ఆయనపై గౌరవముతో, ఆదరముతో కాపాడినది. ఆత్మహత్యా ప్రయత్నమునకు ఒడిగట్టిన ఆయనకట్లు ఊడదీసి క్షేమముగా ఒడ్డుకు చేర్చినది. ఆయనకున్న పాశములను తెంచినది కాబట్టి ఆ నదిని అప్పటి నుంచి "విపాశ" గా వ్యవహరించెదరు. ప్రాణములతో బయటపడినను వశిష్ఠుడు వైరాగ్యము నుండి బయటపడలేదు. ఎలాంటి ఉత్సాహము లేకుండగా జీవచ్ఛవములా పడివున్న భర్తను అరుంధతి ఓదార్చుతుంది. శాపగ్రస్తులైన బిడ్డల గురించి తెలిసినప్పటికీ గుండెను దిటవు చేసికొన్నదామె. బిడ్డలకన్నా భర్తక్షేమమే ముఖ్యమని భావించిన ఆమె ఆయనను సేదతీర్చి

మళ్ళీ మామూలు మనిషిని చేస్తుంది. జీవితమనేడిది అర్థంతరముగా ముగించుటకు కాదని కొన్ని లక్ష్యములను నెరవేర్చడమునకని ఉద్బోధ చేస్తుంది. బ్రతుకుపై ప్రేమను రగిలిస్తుంది. అలా ప్రాణము విలువను చాటిచెప్పి ఆయనను కర్తవ్యోన్ముఖుడిని చేస్తుంది.

ఇలా కష్టనష్టములు వచ్చినప్పుడు భార్యభర్తకు తోడూనీడలా వుండవలయు నని చెప్పడము కూడా అరుంధతీ నక్షత్ర సందర్శనములోని అంతరార్థముగా మనము భావింపవచ్చును. భర్తకు కష్టము వచ్చినప్పుడు తల్లివలె అక్కున చేర్చుకొని ఓదార్చి మళ్ళీ మామూలు మనిషిని చేసే గురుతర బాధ్యతను యీ ఘట్టముద్వారా శాస్త్రము వధువుకు దఖలు పరచడము యిక్కడ మనము గమనించతగిన విషయము. భార్యాభర్తలలో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనే తేడాలు లేవని సంసారమనే రథమునకు యిద్దరూ రెండు చక్రములని చెప్పడము పూర్వమునుంచే వున్నదని మనము గుర్తించవలెను.

**అప్పగింతలు (అంపకములు) :**

మన తెలుగువారి వివాహతంతులలో అప్పగింతలు లేక అంపకముల కార్యక్రమము కడు ఆర్ద్రమైన సన్నివేశము మరపురాని మరచిపోలేని సందర్భము. అప్పుడు వధూవరుల తల్లిదండ్రులు, బంధుమిత్రులు, శ్రేయోభి లాషులు మొదలగువారు వెంటవుండి అత్తవారింట మెలగవలసిన రీతులు, పలు విషయములు, జాగ్రత్తలు తెలిపెదరు. పురోహితుడు వేదమంత్రములతో వధువు తల్లిదండ్రుల చేతులపై ఆవుపాలను పోయగా అవి వరుని తల్లి దండ్రుల చేతులపై పడుతుంటాయి. మాబిడ్డను యీనాటి నుండి మీ చేతులలో పెడుచున్నాము. జాగ్రత్తగా మీకన్నబిడ్డ వలె కాపాడుకోండి సుమా ! అని అప్పగింతల భావము. అప్పగింతల సందర్భముగా వధువు తల్లిదండ్రులు వరుని తల్లిదండ్రులకు బట్టలు పెట్టెదరు. అప్పగింతల కార్యక్రమము పూర్తి కాగానే నూతన వధూవరులు, వధూవరుల తల్లిదండ్రుల పాదపద్మములకు, పెద్దలకు నమస్కరించి వారిచే ఆశీర్వాదము తీసికొని వరుని యింటికి ఊరేగింపుగా బయలుదేరుదురు.



**ఊరు ఎరుగింపు :**

అంపకముల కార్యక్రమము పూర్తికాగానే నూతన వధూవరులను కన్యాదాత గ్రామము లేక పట్టణపు ప్రధాన వీధులలో పూలపల్లకీలలో లేక తగిన వాహనముపై ఊరేగింపు జరిపెదరు. అనగా వీరిరువురు నూతన దంపతులైనారని తెలుపటమని భావమట. ఇదే విధముగా వరుని గ్రామము లేక పట్టణములో కూడా ఊరేగింపు చేసికొని వరుని ఇంటికి చేరెదరు. ఈ ఊరేగింపు ఆచారము కూడా చాలా వరకు తగ్గిపోయినది. ఇంటికిరాగానే నూతన వధూవరులకు ఆడపడుచు(లు) హారతిపట్టు ఆచారము కలదు. హారతి పళ్ళెరములో వారికి లాంఛనములిచ్చెదరు. కానుకలిచ్చెదరు. ఇద్దరు ముగ్గురున్న ఆడపడుచులైతే పెద్దఆడపడుచునకే ఎక్కువ అధికారమున్నప్పటికీ ముగ్గురు లాంఛనమును సమానముగా పంచుకొనెదరు. తరువాత ఆడపడుచు వారిని గుమ్మములోనే ఆపి భార్య పేరు భర్త, భర్త పేరు భార్య చెబితేనే లోపలకు పంపుతామంటారు. ఇక్కడ నూతన దంపతులిద్దరు పేర్లు చెప్పేందుకు సిగ్గుపడతారు. మొదటిగా పేరు చెప్పవలసినది వధువే. పెండ్లికూతురేననుచూ ఆడపడుచు మురిపిస్తుంది. వదినా అన్నయ్య పేరు చెపుతావా లేదా అంటూ పేరు చెప్పేదాకా లోపలకు వెళ్ళనివ్వదు. సిగ్గుల మొగ్గయిన పెళ్ళికుమార్తె వినపడి వినపడకుండగా భర్తపేరు చెప్పినను మరింత గట్టిగా చెప్పవలయునని నిలదీస్తుంది. ఆ తరువాత అన్నయ్య లేదా తమ్ముడు (పెండ్లికొడుకు) కూడా భార్యపేరు చెప్పవలసినదే. తరువాత కుడికాలు ముందు పెట్టి గృహప్రవేశము చేయించెదరు. ఏతావాతా యిదంతా ఆద్యంతము, ఆహ్లాదకరమైన వాతావరణములో జరగడము అందరకు వేడుక పంచుతుంది. ఇంత వేడుక వెనుక ఎంతో సామాజిక అవగాహన, కుటుంబ వ్యవస్థలో వ్యక్తులు కలసిపోయేందుకు దోహదమయ్యేలా ప్రవర్తించెడి తీరు అనూహ్యమైన సంస్కారవిశేషముగా వుండడము మనము గమనించవలెను. నూతన వధూవరులు గృహప్రవేశము చేసిన తరువాత గృహములో దైవారాధన దగ్గరకు వెళ్ళి నమస్కరించెదరు. తరువాత ముత్తయిదువలు బ్రహ్మముడులు

బాషికములు విప్పెదరు. క్రొత్త వధూవరులు దైవ నమస్కారము చేసికొని వెళ్ళిన తరువాత భోజనములను చేయించవలెను. ముత్తయిదువలు బ్రహ్మ ముడులు, బాషికములు విప్పుట శుభప్రదమని పెద్దలందురు.

## అత్తగారింట క్రొత్త కోడలికి కొండంత గౌరవము :

హిందూ కుటుంబములలో అత్తగారింట క్రొత్తకోడలికి విశేషస్థానము, కొండంత గౌరవము లభిస్తుంది. కుటుంబములోని వ్యక్తులందరిపైనా ఆమెకు అధికారము వుంటుందని, ఆమె భావికుటుంబ యజమానురాలని సాక్షాత్తు ఋగ్వేదమే చెప్పింది. అందులకే కుటుంబపెద్దలు ఆమెను యిలా ఆశీర్వదించేవారు.

శ్లో॥ సామ్రాజ్ఞశ్వశురేభవ, సామ్రాజ్ఞశ్వశురావిభవ,
సనాందారి సామ్రాజ్ఞిభవ, సామ్రాజ్ఞి అదిదేవఘు॥

సుపుత్రీ ! మామగారి దృష్టిలో అత్తగారి దృష్టిలో మహారాణివికా. భర్తదృష్టిలో మహారాణివికా. మరుదుల దృష్టిలో మహారాణివికా. ఇదే మా ఆశీర్వచనము. ఇదే మా ఆకాంక్ష. మా ఉపదేశము. ఋగ్వేదసూక్తికి యిదీ స్థూలార్థము. దీనిని బట్టి సాంప్రదాయము క్రొత్త కోడలికి ఎంత విలువ యిస్తుందో మనకు యిట్టే అర్థమౌతుంది.

ఉత్తర భారతదేశములో కోడలిని "బహురాణి" గా వ్యవహరించడము కూడా యిదేఅంశమును బలపరుస్తుంది. అలాగునే యీసందర్భములో చెప్పే

శ్లో॥ సుష్నాణాగ్శ్వశురాణాం ప్రజాయశ్చ ధనస్యచ,
పతీనాంచ దేవూణాంచ సంజాతానాం విరాడ్భవ॥

ఈ మంత్రము కూడా యించుమించు పైన చెప్పిన విషయమునే వరుడు చెప్పినట్లుగా చెబుతుంది. అంటె మా ఇంటిలోని కోడళ్ళపైన, అత్తమామల పైన, నా సోదరులపైన రేపోమాపో పుట్టబోయే నీ సంతానముపైన, నా ధనంపైన సర్వం సహా ఆదిపత్యము నీదే. ఇది దీని సారాంశము.

వివాహము పూర్తి అయిన తరువాత కన్య క్రొత్తకోడలిగా అత్తగారింట కాలుపెడుతుంది. పెద్దలపట్ల గౌరవము, పిన్నలపట్ల ఆత్మీయతను ప్రదర్శించుచూ కుటుంబములో అందరి మన్ననలను పొందుతుంది. పాలలో



చెక్కర కలిసినట్టుగా అత్తగారింట్లో కలిసిపోతుంది. పుట్టింట్లో తాను నేర్చుకొన్న సంస్కారములను అత్తవారింట్లో కొనసాగించుచూ కుటుంబ శ్రేయస్సునకు కృషిచేస్తుంది. కుటుంబములోని అందరి ఆదరణ, అభిమానమును పొందడమునకు తగిన హక్కులను సాధించుకోవడమునకు ఆమె ఘర్షణ వైఖరి అవలంభించదు. కేవలము ప్రేమాభిమానములతోనే వాటిని సాధిస్తుంది. ధర్మార్థకామ మోక్షములను సమన్వయపరచే శక్తి భార్యకు మాత్రమే వుంటుంది. మహాభారతము గృహస్థాశ్రమ ధర్మమును స్వీకరించ డములోనే పురుషుడికి ధర్మార్థ కామమోక్షములను సాధించేందుకు మార్గము సుగమమవుతుంది.

## శ్రీసత్యనారాయణస్వామి వారి వ్రతము :

వరునియింట శ్రీసత్యనారాయణస్వామి వారివ్రతము లేక నోము చేసికొనెదరు. వ్రతానంతరము (రిసెప్షను జరుగుతుంది) చాలమంది తమ బంధుమిత్రులకు, వియ్యాలవారి బంధుమిత్రులకు సహబంతి భోజనములు పెట్టుకొనెదరు. ఇంతటితో పురోహితుడు దగ్గరుండి చేయించు పెండ్లి కార్య క్రమము శుభకార్యము పూర్తి అగుతుంది. పురోహితులవారు పెండ్లి కార్య క్రమము మరియు వ్రత కార్యక్రమము సంపూర్తి చేసినందులకు వధూవరుల తల్లిదండ్రులు వారివారి తాహతకొద్ది (పారితోషకము) దక్షణ తాంబూలము లిచ్చి పంపెదరు.

తదుపరి వరుని యింట ఒకటి లేక మూడురాత్రులు నిద్రలు అయిన తరువాత వధువుగారి యింటికి అక్కరకు తీసికొనివెళ్ళెదరు. అక్కరగువరకు వధూవరులు బ్రహ్మచర్యమును పాటించుచూ, సాత్వికాహారమును భుజించుచూ, విడివిడి స్థానములందు శయనించవలెను.

## గర్భాధానము (శోభనము) :

మానవులకు జరుగుషోడశ (16) సంస్కారములలో చాలా ప్రాముఖ్య మైనది. మొట్టమొదటిది యీ గర్భాధాన (శోభనము) సంస్కారమే. అందులకే అసలు వివాహము సంస్కారము గర్భాధానము (శోభనము) జరగని యెడల వారికి ముఖ్య వివాహము జరగలేదని యెఱుంగవలెను. ప్రతిజ్ఞా

ప్రమాణములు వివాహ సంస్కారము మాత్రమే. కాబట్టి గర్భాధాన క్రియయే వాస్తవిక వివాహమని పెద్దలందురు. కొన్ని ప్రాంతములలో దీనిని "బట్టలిచ్చుట", "గృహప్రవేశము చేయించుట", "బల్దానము" అను పేర్లతో కూడా చెప్పుకొనెదరు. కాని యిప్పటివారు గోప్యముగా జరుపుకొనుచుండిరి. వివాహమైన 16 రోజులలో గర్భాధానము (శోభనము) చేసిన తిథివార నక్షత్రములను చూడనవసరములేదు. వధువుగారి యింట యీ గర్భాధాన కార్యక్రమము జరుగుట మన సాంప్రదాయముగా వచ్చుచున్నది. గర్భాధాన సంస్కార అనంతరము వధూవరులకు నూతన వస్త్రములను కట్టబెట్టి వధువును పాలగ్లాసుతో గదిలోనికి పంపెడివారు. పూర్వము యిదికూడా ఒక పెద్ద కోలాహలముగా జరిపెడివారు. వధువుగారి యింట ఒకటి లేక మూడు రాత్రుళ్ళు గడిపిన తరువాత వరుని యింట ఒకటి లేక మూడురాత్రులు గడిపెదరు.

## పదహారురోజుల పండుగ :

పెండ్లిఅయిన రెండువారముల తరువాత 16వ రోజున వరుని యింటిలో నవవధువుతో వధూవరుల తల్లిదండ్రులు, బంధుమిత్రులు పదహారురోజుల పండుగ కడువేడుకగా సరససల్లాపములతో చతురులతో ఆనందకోలాహముగా జరుపుకొనెదరు. ఇరువైపులవారు ఇష్టమృష్టాన్నములతో, విందుభోజనములతో కోలాహలంగా, మహోత్సవంగా పెండ్లినాటి విశేషములను నెమరువేసికొనుచు, జ్ఞాపకము తెచ్చుకొంటూ ఆరోజు ఎంతో హాయిగా గడిపెదరు. ఇంతటితో యీ పెండ్లిసందడి (తంతు) కార్యక్రమము పూర్తి అగుతుంది. ఈ విధముగా జరిగిన పెండ్లి కార్యక్రమమును చూచిన వారిని, ఈ పెండ్లిసందడి పుస్తకము చదివినవారిని, వినినవారిని ఆ శ్రీశైల మల్లిఖార్జున దంపతులు, భద్రాద్రి సీతారాముల దంపతులు, తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి పద్మావతి దంపతులు ఆయురారోగ్యభోగభాగ్యములు, సుసంతాన సౌభాగ్యములిచ్చి కాపాడుగాక ! యని ప్రార్థించుచున్నాను.

ఓం శాంతిః శాంతిః శాంతిః

సర్వేజనాః సుఖినోభవన్తు.



**వరుని తరపువారు ప్రదానములో తెచ్చునవి.**

1. పసుపు 1/4 కిలో
2. కుంకుమ 100 గ్రా
3. ఖర్జూరకాయలు 100 గ్రా
4. బెల్లము 1 కిలో
5. ఎండుకొబ్బరిచిప్పలు 1 కిలో
6. గంధపుపొడి 1 డబ్బా
7. వక్కలు 50 గ్రా
8. టాయ్‌లెట్ సామానులు (అద్దము, దువ్వెన, కాటుక, తిలకము, పేస్‌పౌడరు, జడపిన్నులు, హేర్‌ఆయిల్, రిబ్బను తదితరములు)
9. నల్లపూసలు
10. దారపు కట్టు 1
11. అరివేణి (గరికబుడ్డి)
12. క్రొత్త మూకుడు
13. దీపారాధనకు నూలుబద్దె
14. కందపిలక
15. కొబ్బరిబోండాము

**వరుని తరపువారు పెండ్లివద్దకు తెచ్చునవి.**

1. పసుపు 50 గ్రా
2. కుంకుమ 25 గ్రా
3. ఖర్జూరకాయలు 2 రూ.
4. బెల్లము 50 గ్రా
5. ఎండుకొబ్బరిచిప్పలు 2
6. వక్కలు 2 రూ.
7. అరివేణి (గరికబుడ్డి)
8. క్రొత్త మూకుడు
9. తమలపాకులు 2 కట్టలు
10. అరటిపండ్లు 25
11. సాంబ్రాణి కడ్డీలు 2 రూ.
12. కర్పూరము 2 రూ.
13. పూలదండలు 2
14. జీలకఱ్ఱ 50 గ్రా
15. రవికగుడ్డలు 2
16. మంగళసూత్రము
17. తలంబ్రాల బియ్యము
18. తలంబ్రాల వస్త్రములు
19. తలంబ్రాల సెండ్లు (చెంకీలు) 2
20. బాషికములు 2
21. మంచి గుమ్మడికాయ (కన్యాదాతకూడావారి తరుపున పెండ్లివద్ద సిద్ధముచేసి వుంచవలసినవివే.)

**శ్రీసత్యనారాయణస్వామివారి వ్రతంవద్దకు కావలసినవి**

1. పసుపు 100 గ్రా
2. కుంకుమ 50 గ్రా
3. ఖర్జూరకాయలు 200 గ్రా
4. కొబ్బరికాయలు 10
5. ఎండుకొబ్బరిచిప్పలు 2
6. గంధపుపొడి 1 డబ్బా
7. వక్కలు 200 గ్రా
8. తమలపాకులు 2 కట్టలు
9. సాంబ్రాణి కడ్డీలు 1 ప్యా.
10. కర్పూరము 2 రూ.
11. పూలు 10 మూరలు, విడిపూలు కూడా
12. అరటిపళ్ళు 25
13. తుండుగుడ్డ 1
14. రవికగుడ్డలు 4
15. ఆవుపాలు 5 రూ.
16. ఆవునెయ్యి 5 రూ.
17. ఆవుపెరుగు 5 రూ.
18. తేనె 2 రూ.
19. గోధుమరవ్వ 1 కిలో
20. పంచదార 1 కిలో
21. జీడిపప్పు 50 గ్రా
22. కిస్‌మిస్ 50 గ్రా
23. ఎండుద్రాక్ష 50 గ్రా
24. పటికిబెల్లం 100 గ్రా
25. యాలుకలు 25 గ్రా
26. చిల్లర 10 రూ.
27. రూపాయిబిళ్ళలు 25
28. నువ్వులనూనె 1/2 కిలో
29. స్వామివారి పటము
30. మందిరము, దీపపు కుందులు
31. మామిడాకులు
32. సాంబ్రాణి (డ్యూపిస్టన్)
33. వడపప్పు (కావలసినన్ని)
34. పానకము (కావలసినన్ని)
35. పొంగలి
36. గారెలు, పూర్ణాలు (తదితర పిండివంటలు)


రచయిత సాదినేని రంగారావు గారి వంశవృక్షము
రామయ్య
(భార్య) మహాలక్ష్మమ్మ
వెంకటసుబ్బయ్య
(భార్య) లక్ష్మీబాయమ్మ
చింపిరయ్య
(భార్య) వెంకాయమ్మ
చిట్టెమ్మ
(భర్త) గుంటుపల్లి వెంకటసుబ్బయ్య
రంగమ్మ
(భర్త) చింతల కోటయ్య
శేషయ్య
(భార్య) రుక్మిణమ్మ
ఆదెమ్మ
(భర్త) గింజుపల్లి కాళిదాసు
వెంకటప్పయ్య చౌదరి
(భార్య) అన్నపూర్ణమ్మ
సీతారామమ్మ
(భర్త) గింజుపల్లి
బాపయ్య చౌదరి
శేషగిరిరావు
(భార్య) సామ్రాజ్యమ్మ
రంగారావు
(భార్య) రామతులశమ్మ
వెంకట్రావు
(భార్య) మహాలక్ష్మి
కామేశ్వరమ్మ
(భర్త) గొరిజవోలు
పరమేశ్వరరావు
శివరామకృష్ణ
(భార్య) ధనలక్ష్మి
రాధాకృష్ణ
(భార్య) నీలిమ
శ్రీసృజన
శ్రీకృష్ణ



